# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

# GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY



'GRIHALAKSHMI' GRIHA

సంపాదకుడు

డాక్టరు కె. యన్. కేసరి



సంపుటము ౨౧] ఏప్రిల్ 1952 [సంచిక ౪




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయాధిక్యము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలువుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము వచ్చు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.



బెంగుళూరు సిటీలోనే

గాంధీనగర్—

# టాజ్ మహాల్

బోర్డింగ్ అండు

లాడ్జింగ్ హోటలులో

బసచేయండి.

నూతన భవనం. చక్కని ఆధునిక వసతులతో నిర్మించిన గదులు, వేడినీళ్లు, చన్నీళ్ల స్నానానికి వసతులు, నవీన గృహోపకరణములు, రుచికరమైన శాకాహారము, సమర్థమైన అజమాయిషీ, చక్కని పరామర్శలకు ప్రత్యేకత!

సెక్రెటేరియట్‌కు, కోర్టులకు, సినిమాలకు సమీపములోనున్నది. బస్‌స్టాండు, జట్కాస్టాండు అందుబాటులోనున్నవి.

అన్ని విధముల ఉత్తమ తరగతికి చెందినదని మీ అనుభవమే తెలుపగలదు.

---

# ఖర్చు తక్కువ ఫలమధికము!



మీరిక ధనము అధికముగా వెచ్చించి మోటారుకార్లకు, లారీలకు, బస్సులకు క్రొత్త టైర్లు కొననవసరములేదు!

మీపాతటైర్లనే క్రొత్తవిగా సరసమయిన చార్జీలకు తయారుచేసి యివ్వగలము. మానాణ్యమైన పనితనము మీకు తప్పక తృప్తికలిగించగలదు.

అన్ని సైజులలో తయారయిన టైర్లు కూడ అమ్మకమునకు సిద్ధముగానున్నవి.

వివరములకు: జయ కేసరి కంపెని,

15 వెస్టుకాట్ రోడ్డు,

రాయపేట, మద్రాసు 14.

# విషయసూచిక





ముఖచిత్రము: మారాధ.

శ్రీ రాధాకృష్ణుల ప్రే
మారాధన చేయుచుంట। మధుమాధవి తా।
మారెన్నిల నలుగురిలో
మారాధగ ; కృష్ణుడిచ్చు। మహిత శుభంబుల్ ।




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



## స్వాగతము



నందనాబ్దమ! మిపుల ఇబ్బందులందు దవివినాదము; మరి సర్వధారియును, వి
రోధి వికృతియును ఖరలోన మేము భరతమాతృక నీరాకకొరకు తాను
తపము చేయుచునుండె తత్తపమువలన వచ్చినావీవు నాల్గేండ్లబట్టి జనము
'లన్నమో రామచంద్రా' యటంచు నటమటించువారి వేవేగ రక్షింపు మీవు.
పర్వతశిఖరములనుండి ప్రభలులేచు వజ్రములతోడ నీకునివాళి నొసగ
కుహు కుహూరావమున నినుకూర్మిబిలువ నల్లదే నిల్చె మా భారతాంబ గనుము
అరువదేండ్లయ్యె నిన్జూచి భరతమాత నీకు స్వాగతమీయ తానిలచియుండె
గనుము హిమవన్నగాగ్ర శృంగాలమీద నందనాబ్దము స్వాగత మందుకొనుము.

మూలా పేరన్నశాస్త్రి

# ప్రేమ సమాజం

శ్రీ పి. వి. తాతాచారి

ప్రాతఃకాలము ఆరుగంటలయింది. సీతాకాలపు సూర్య భగవానుడు తన లేత వేడికిరణాలచేత గిలిగింతలు పెడుతూ 'యింకా నిద్రేనా! లే' అని సూర్యాన్ని మేలుకొలిపేడు. సూర్యం కండ్లునులుపుకుంటూ, మంచాన కూర్చొని ఆశ్చర్యంతో తూర్పునకు తిరిగేడు. ఆదిశనుండి వస్తూన్న అవ్యక్తపు ధ్వని సూర్యాన్ని ఆశ్చర్యంతో ముంచింది. కొన్ని క్షణాలలో ఆధ్వని 'ఇదీ' అని చెప్పడానికి వీలుపడింది.

మద్దెలల వాయింపులు! ఆర్మోనియముల సరిగమలు!! సొనాయిల మధుర స్వరములు!!! యివే కొంతవఱకు పాటగాండ్రను మఱుగు జేస్తూయున్నవి.

'ఏమిటా ?' అని సూర్యం, 'కరుణామయీ!' అని ఒక్కకేక వేసేడు. అతిస్వల్ప కాలంలోనే కరుణ చేతపూలనుగొని 'ఏమండీ' అంటూ సూర్యం మంచంవద్దకువచ్చి నిలువబడింది. తెల్లవారకమునుపే స్నాన పానములు నిర్వర్తించి, పూజకై సిద్ధముగానున్న కరుణనుచూచి 'తెలిసీ తెలియని ఆధ్వని యేమిటీ కరుణా!' అనిసూర్యం ప్రశ్నించాడు తన ధర్మపత్నిని.

'కట్టడానికి బట్ట, తినడానికి తిండీ యిచ్చి, బీదవారిని రక్షించడమే తమపనని యెంచి తెల తెల వారగనే ప్రేమ సమాజంవారు ధనాన్ని దండడానికి బయలుదేరారు. ఆధ్వనులే అవి! ఆ పాటలు వారే పాడుచున్నారు!! లెండి! మీకుతోచింది మీరూ యివ్వండి!' అని అంది కరుణ.

ఆమాటవిని అమాయకంగా, ఆరేండ్ల పసిపాప 'నాన్నా! నిజంగా ప్రేమ సమాజంవారు దండిన సొమ్మును బీదసాదలకే వినియోగిస్తారా!' అని అంది. ఆమాటలో ఎంత అర్థమిమిడి వుందో కదా!

'వెఱ్ఱిపిల్ల! నీవడిగిన ప్రశ్నకు జబాబు చెప్పవలసిందే' అని మంచాన కూర్చున్న సూర్యం గ్గునలేచి తన జేబులో ఏముందని కరుణను ప్రశ్నించాడు. గభాలున కరుణ లోనికేగి జేబులన్నియు వెదకి ఒక అణాను మాత్రమేతెచ్చి 'ఉన్నదిది' అని అందించింది తన భర్తకు.

'కరుణా! ఆ అణాను శారదకియ్యి. మనశారద అడిగిన ప్రశ్నకు జబాబు చెప్పగలవా? చదువుకున్న దానవు'. అని అన్నాడు సూర్యం.

'నా ఉద్దేశ ప్రకారం వారంతా ధన్యజీవులు! పేదవారిని రక్షించడమే తమ కర్తవ్యమని నిత్యం రాత్రినక పగలనక, ఎండనక వాననక కష్టపడుతూన్న ఉత్తములు!! ఈ విషయంలో వారు పూజ్యులు!!!" అని అంది కరుణ చిరునవ్వును వెదజల్లుతూ.

'కరుణా! నీవుచాలా పొరబడ్డావు. నిజానికి నీవు చదువుకున్న దానవే కాని మిక్కిలి అమాయకురాలవు. లోకంలో వివిధవ్యక్తుల బుద్ధులను పరిశీలించడానికి నీకు విజ్ఞానము సు భగవంతుడీయనందుకు చాలావిచారిస్తున్న' అన్నాడు సూర్యం భావగర్భిత హృదయంతో.

ఇంతలో ప్రేమ సమాజంవారు వివిధరకాల పాటలలో వారింటి దగ్గరలోకి వచ్చారు. ముందు యిద్దరు వ్యక్తులు రెండుడబ్బాలతో 'బాబూ! మీకుతోచింది యిందులో వెయ్యండి, అంటూ 'వచ్చీపోయే' జనాన్ని అడుగుచూ యింటింటికినీ పోయి డబ్బాలు చూపుతున్నారు. ఎవరికి తోచింది వారు 'కానియో పరకో' వేస్తున్నారు డబ్బాలలో.

సూర్యం యింటికి కూడావచ్చారు ప్రేమ సమాజంవారు. 'అమ్మా! శారదా! అమ్మయిచ్చిన ఆ అణాడబ్బులు డబ్బీలోవేయమ్మా!' అన్నాడు సూర్యం.

ఒక వ్యక్తి డబ్బాను పట్టుకొని చేయి చాచడం, శారద ఆ డబ్బీలో ఆ నాలుగుడబ్బులు వేయడం, నకనకలాడుతూ, నోట మాటనురాక, అతి నీరస స్థితిలో నున్నమరో బిచ్చగాడు ఆ యింటి ముంగిట నిలువబడి అమ్మా! అని అనడం యీ మూడుపనులూ ఒక్క క్షణంలో జరిగినవి. డబ్బీలో ఆ అణాపడగనే,

ప్రేమ సమాజంవారు ఆ యింటిని మరు క్షణంలోనే దాటేరు.

ఈ దృశ్యాన్ని కండ్లార చూచిన ఆ కరుణామయి గుండెలు తరుక్కుపోయింది! నిజాన్ని గ్రహించింది!! తనది తప్పని భావించింది!!! కన్నీరుకూడా కార్చింది. అమ్మ కన్నీరునుచూచి ఆ పసిపాప శారద కూడా కంట తడి పెట్టింది.

శారద కండ్లు కన్నీటితో నిండియుండడం చూచి దగ్గఱకు లాగుకున్నాడు.

“కరుణా! చూచావా! నిజంగా యీ ప్రేమ సమాజం వారు బీదసాదలను ఆదరాభిమానాలతో చూస్తే యీ బిచ్చగాండ్రు మరల, నింటింటికి వచ్చి, బిచ్చమెత్తడం దేనికి? యిందాక వచ్చిన బిచ్చగాడు ‘అమ్మా!’ అని మనవైపు తిరిగి చూచునపుడు వారు చెంతనే యున్నారుగదా తమ డబ్బీలోనున్న రెండు కానులను ఆ బిచ్చగానికి యిస్తే యెంత బాగుండును! మన ప్రత్యక్షంలోనే వీరినింత నిర్దయగా యీ సమాజంవారు చూస్తే మన పరోక్షంలో వారికి డబ్బు వ్యయపరచి కూడా గుడ్డాయిస్తారని ఏమినమ్మకం!!” అని శారద కండ్లు తుడచి, లోనికి ముగ్గురూపోయేరు.

---

## కరువు కథ!
(అగర్భ శ్రీమంతులు - అగర్భ దరిద్రులు)

తిండిగింజలకు కట కట
మండుటెండలో నడకట
మీదుమిక్కిలి తిండిట
కడుపుబాధలతో మూల్గుట

చీరలేకయే సిగ్గుట
మానముకోసరం మగ్గుట
చీరలపై చీరలట
చినిగిన పేలికలు దానమట

పంచభక్ష పరమాన్నాలట
విందులతో బహుకులాసట
త్రాగను గంజే లేదుట
పస్తులతో ఆఖరిచావట

పిల్లలచాకిరీ రాలేక విసుగుట
చాలు, చాలు అని దండమట
చీముడిముక్కుల సంతట
భలేలక్షాధికారి బిడ్డలట.

క్యూలోనిలపడి వృత్తిచేతులతో రాకట
ఇంట్లోపసికందుల బాధలట
స్టోరే నిర్మించాడుట
భలే సోకుగ ధర్మలింగం చెట్టట!

అయ్యారే రామచంద్రరావింట
హాయ్యారే బియ్యపు మూటలు
మెతుకోకయుగమే బీదలకంట
గతికి కలకాలమేమి వారు చేస్తారంట

కరువురోజులలో బీదల సోదలట
బరువేకాదా అని పెద్దల గుస గుసలట
కాలం, స్వతంత్రం బీదలదట
అన్నం, డబ్బు మహారాజులదట

కరువు, బరువు బీదలదట
పరువు, డబ్బు, కీర్తి మహారాజులదట

మిస్. నిరుపమ గురుపల్

# ఆ రా ధ న

ప్రకృతిలో ఆరాధన మానవాతీతమయిన దేవాంశములున్న నేకాని సమకూరదు. కాబట్టే మానవుడు ఆరాధనకు పూనుకొనేముందు ఆ లక్షణములకొరకు అన్వేషిస్తాడు. పుణ్యపురుషులైన శ్రీరామచంద్రుడు, కృష్ణుడు, ఏసుక్రీస్తు, మహమ్మదు, గాంధీజీ మొదలైన వారందరు పైలక్షణాలతోటే ఆరాధనా యోగ్యులయినారు. మానవకోటి వారి బోధనలను విన్నారు; వారి పవిత్ర జీవితాలను ఆదర్శప్రాయంగా తీసికొన్నారు.



నిరాడంబర జీవితం, త్యాగసేవాసక్తి, ఉదార హృదయం మానవుని ఆరాధనా యోగ్యుడుగాచేస్తవి. అట్టి లక్షణాలు కలవారు బహుకొద్దిమంది. వారిలో శ్రీ కె. యస్. కేసరిగారొకరు.

శ్రీ కేసరిగారికి యీరోజున 77 సం॥లు నిండి78వ సం॥ము ప్రారంభమగుచున్నది. ఈ సందర్భంలో ఆనందోత్సాహములతోటి వారి ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధికిగాను భగవంతుని ప్రార్థిస్తూ వారిని ఆరాధించేవారు అనేకమంది యున్నారు. అనేక సంస్థలు కృతజ్ఞతా పూర్వకంగా అభినందిస్తున్నవి.

కడుబీద కుటుంబములో పుట్టి స్వయం కృషివలన సమకూరిన సంపదను లోకకల్యాణమునకు వినియోగిస్తూ నిరాడంబరమైన జీవితమును గడుపుతున్న మహనీయుడు శ్రీ కేసరిగారు.

వారి త్యాగం, సంఘసేవాసక్తి మూలంగా అనేక సంస్థలు అభివృద్ధి గాంచుతున్నవి. వారి ఉదార హృదయం అనేక బీదసాదలకు జీవనోపాధి కల్పించినది. దానధర్మములు వారి విశాల హృదయమునకు నిదర్శనమయింది.

వారిభాషాసేవ అపారమయింది. కవులు, కవయిత్రులు, పండితులు, విదుషీమణులు అనేకులు వారిచే సన్మానించబడ్డారు.

శ్రీ కేసరిగారు తమ 'గృహలక్ష్మి' పత్రిక ద్వారా మహిళాభ్యుదయానికి, మహిళా ఉద్యమ వ్యాప్తికి అమోఘంగా కృషిచేశారు. తాము స్థాపించిన విద్యాలయములు విద్యావ్యాప్తికి సర్వతోముఖంగా కృషిచేస్తున్నవి.

అంతేకాదు - కళాపిపాసికూడాను. వారు తలపెట్టిన ఏకార్యమైనను, భవన, ఉద్యానవన నిర్మాణములు కళాతన్మయత్వమునకు నిదర్శనములు. వారికి సంగీతము, చిత్రలేఖనము మొదలగు లలిత కళలయందుగల అభిరుచి అనేక విద్వాంసులకు సత్కార సన్మానముల సమకూర్చినవి.

శ్రీ కేసరిగారి దివ్య ఔషధములు 'లోధ్ర' మొదలైనవి ప్రజాసామాన్యానికి చక్కని ఆరోగ్యమును ప్రసాదించి మహోపకారం చేస్తున్నవి.

మానవసేవయే భగవత్సేవగా తలచునట్టి శ్రీ కేసరిగారికి భగవంతుడు సంపూర్ణ ఆయురారోగ్యములు ప్రసాదించుగాక!

'లక్ష్మి'

---

# నిరీక్షణ



పలుక వేలనో
పలుక వేలనో జాబిలీ॥

ఈనాటి ఆనాటి చెలిమి కాదోయి
ప్రసవ మొందిననాడె చెలిమి చేసితి నోయి॥

కలువ కొలను స్వామివని వాసి గన్నావు
సౌందర్య రాజవని ఖ్యాతిగన్నావు
కలికనగు నామీద కినుకచూప తగునోయి॥

మేలిముసుగు మరల్చి ముగ్ధమోము
చూడ రాదో

మొయిలు భామ మాటున మామ
మమెద వేలా॥

నిండారిన జవ్వనముతో వేగుచున్న దాన
నిండు నీమనసుకై వేచియున్న దాన ...
పలుక వేలనో
పలుక వేలనో జాబిలీ ....

కమల, జోగారావు

# స్త్రీ హృదయం

వేపకొమ్మ
రాధాకృష్ణమూర్తి బి. ఎస్.సి.

మా ఆవిడ రాజ్యానికి సుజాత అంటే గిట్టనే గిట్టదు. సుజాత మా ఆఫీసులో ఓ గుమాస్తా. నాతోపాటే అన్నమాట. రాజ్యం అన్నీ తెలిసీ, అన్నీ తెలీకండా ప్రవర్తిస్తుంది. ఆమె సవ్యభారత దేశానికి సరిపోదు. ఆమెకు చాల మూఢనమ్మకాలున్నాయి. ఆమె భర్త పరాయి ఆడదానితో చనువుగా మాటాడినా, వాళ్ళ యింటికి పోయినా చాల అనుమానం. ఆమె యింకను నాగరకురాలు కాలేదని అనాలి. రాజ్యం ఒక సంసార స్త్రీగా నుండుటకు చాల తగింది. ఎంత సేపటికీ ఇంటి సంగతులేగానీ వేరేమీ అవసరంలేదు. మా ఆఫీసరును మార్చినందున నిన్న మా ఆఫీసులో టీ పార్టీ జరిగింది. అందులో నా ప్రక్కనే ఆవిడ కూర్చుంది. ఈ విషయం ఎవడో ఒక గుమాస్తా తన భార్యతో చెప్పగా ఆవిడ రాజ్యానికి తెలియజేసింది. ఇంటికి రాగానే లడాయి. మితిమీరి పోతున్నారంటే, లోకులు అనేక విధాలుగా అనుకొంటున్నారంటే, ఇంతకన్నా ద్రోహం యేముందంటే ... ఓ ... వేయిరకాలుగా ఆడిపోయడం.

ఇంతకూ ఒకరి ప్రక్కన ఒకరు కూర్చున్నందునా, మాటాడినందునా యేంతప్పులేదని నా వాదన. అది చెవిని బెట్టేగా! తక్కిన వారంతా అలాచేస్తున్నారా ? అని ప్రశ్న. మనం ఒకరి త్రోవను ఎందుకు వెళ్ళాలని నేను. మనమార్గం శుద్ధమైనపుడు ఒకరిని అనుసరించడంలో అర్థంలేదని నా వాదన. ఇంతకూ నా వాదన నిల్చిందనా ... ఊహు ... నాకే విసుకేసింది. వాకిట్లోకిపోయి యీజీచైరులో కూర్చొని సిగరెట్ ముట్టించా. పొగ వదలుతుంటే రింగులు రింగులుగా మేఘాల్లా పైకి పోతున్నాది. అప్పుడు నామనస్సులోని కష్టాలన్నీ అలా ఎగిరిపోయినట్లే భావించా. ఇంతలో ఆలోచనలు ... అయిదేండ్ల క్రిందట విషయాలు.

అప్పటికి నాకింకా పెళ్ళికాలేదు. ఆ సంవత్సరమే బి. యెస్. సి. ప్యాసైనాన్నమాట. ఉద్యోగం కోసమై మద్రాస్ వెళ్ళాను. ఒక రోజున మెరీనాకు వెళ్ళి ఇసకలో కూర్చొని యేదో ఆలోచనలో మునిగియున్నా. వెనకనుండి చప్పట్లు వినవచ్చాయి. ఎవరా అని వెనక్కి చూచేసరికి ఎవరో ఒక వ్యక్తి, ఒక ఆడమడి, ఆవిడ సరాసరి నావైపే వస్తూంది. ఎవరా అని ఆలోచించా. ఆమెది మావూరే. చిన్నతనాన్నుండీ తెలివిగా తరగతులన్నీ దాటుకొని వచ్చింది. ఇప్పుడేం చేస్తుందో తెలీదు. కానీ ఆమె నన్నెలా అంత దూరాన్నుంచి గుర్తించిందో ఆశ్చర్యం. ఇంతలో దగ్గరికివచ్చి,

"ఏమండీ, —— గారూ, యేమిక్కడ నున్నారే" అన్నాది.

"ఏమిలేదులెండి" అన్నా. ఆమె పేరేమిటా అని జ్ఞాపకం చేసికొంటూ ఇంతలో, "యేమండీ—యేదో ఆలోచనలో ఉన్నారే. నన్ను జ్ఞప్తియుందా."

"మిమ్మల్ని గుర్తించలేకేమి."

"అయితే నా పేరు చెప్పండి" అన్నది.

తలపై బండ పడ్డట్లైంది. పేరు చెప్పకపోతే మరచినట్లే. తప్పుపేరు చెప్పిన నవ్వుల పాలౌతుంది. అయినా ధైర్యంచేసి "మీ పేరు సుజాత కదూ"... అన్నా.

"ఔను ... అట్లయితే జ్ఞాపకమున్నట్లే."

'అబ్బా ధన్యుడను' అనుకొన్నా.

తర్వాత యేదో లోకాభి రామాయణం జరిపాము. చిన్నప్పటి విషయాలు చర్చించాం. కాలం సరదాగానే గడిచిపోయింది. చీకటిపడింది. ఇరువురు విడిచిపోయి బసలకు దారి సాగించాం.

అది మొదలు అచట కలుసుకోటం అలవాటైంది. ఆమె అప్పుడు ఇంటర్ చదువుతూండేది. క్రమంగా ఆమెకు అర్థంకాని పాఠాలను నేనే 'టీచ్' చెయ్యటా

నికి మొదలెట్టాను. ఆమెకు ప్రతిదినమూ నోట్సు కూడ వ్రాసిస్తుండేవాడిని.

ఆదేదో ఆమెపై నాకో అభిప్రాయం యేర్పడింది. అది యేమిటో అని నేనెప్పుడూ ఆలోచించలేదు. కానీ ఆవిడతో బీచిలో కూర్చున్నప్పుడు నాలో యేదో వుద్రేకంగా వుండేది. సుజాత నాతో చాల చనువుగా వుండేది. ప్రక్కనే వచ్చి కూర్చొని చాల ముచ్చటగా మాట్లాడేది. సుజాత మాట్లాడేటప్పుడు ఆమె కండ్లల్లో యేదో జ్యోతి నాకు కన్పించేది. ఆమె ముఖంలో ఒక తేజస్సు కన్పడేది. అది నా ఒక్కడి అనుభవమో అందరికలా వుంటుందో నాకు తెలీదు. నాలోని మార్పులేమైనా ఆమె గ్రహించిందో లేదో!

ఒకనాడు ఇద్దరం బీచిలో కూర్చుండి యున్నాం. దగ్గరలోనే సముద్రపుటలలు విపరీతంగా మ్రోగుతున్నాయ్. విసుగులేకుండా ఒక్కొక్క అల ఒడ్డుకుతన్ని వెనక్కు మరలి నశిస్తూంది. వినీలాకాశం, నీలసముద్రం రెండూ దూరానా యేకమైనట్లుంది. ఆ ప్రాంతంలో అట్టే జనంకూడా లేరు. నా హృదయంలోవున్న విషయం వెలికి ఉబుకుతుంది. చెప్తే యేమనుకొంటుందో? సంతోషించునో, పరితపించునో, యెలా తెలుస్తుంది. చెప్పకున్న ... నిజం ఎన్నటికీ దాగదుకదా, తర్వాతైనా జరిగేది జరక్కమానదు. అంత్య నిష్ఠూరంకన్నా ఆది నిష్ఠూరమే మేలు. యేమైనాసరే హృదయంలో వున్నది చెప్పవలసిందే అని నిశ్చయించా.

"సుజాతా!" అని పిల్చాను. తిరిగి చూచింది. ఆమె దృక్కులు ప్రశ్నార్థక చిహ్నాలుగావున్నై.

మరల నిశ్శబ్దం.

"యేమిటండీ" అనింది.

"చూచావా వినీలాకాశం. ఎంత గంభీరంగా వుందో. ఆ సముద్రఘోష చూచావ్. ఆ వచ్చే అల ఎంత భీకరంగావుందోచూడు. ఇంతలో ఒడ్డు తగిలి పటాపంచలైపోయింది" అన్నా యేదో ధోరణిలో. నేను చెప్పదలచుకొంది ఇదికాదు.

"ఏమండీ యీవేళ ఓమాదిరిగా వున్నారే" అన్నది.

"యేమీలేదు... నేను రేపుప్రొద్దున Express లో మావూరికి వెళ్ళిపోతున్నా."

"ఆ... అలానా ... మీరింతకుముందు చెప్పనేలేదే? ఇంత త్వరగాపోవటం యెందుకో? ఇంట్లో అందరూ కులాసాయేనా" అని ప్రశ్నల వర్షం కురిపించింది.

"అబ్బే అంతా బాగున్నారు. పదిరోజుల్లో నాకు వివాహం" అన్నా.

"ఆమె మొదట నిర్ఘాంతపడింది." కానీ సర్దుకొని,

"ఓహో అదా విషయం. ఇన్నిరోజులు దాచారే? ఎవరినిచ్చి మీకు వివాహం?"

"సుబంధువుతే, మేనమామ కూతురే."

"రాజ్యమా"

"ఆ... అవును. రాజ్యాన్ని నీకు తెలుసా."

"తెలీకేం, ఇది నాకు మనస్ఫూర్తిగా ఇష్టమే."

"అంటే. రాజ్యం కాకపోతే ఇష్టంలేదన్నమాట."

కొంచెము నేపూరొక్కని "ఇప్పుడు నాకేం చెప్పాలో తోచడంలేదు. ఇన్నాళ్ళు మీపై ఆశ పెట్టుకున్నా, కాని రాజ్యం మీకు దగ్గరి బంధువు. నాకు కొంచెము తెలిసినావిడ కాబట్టి నేవిరమించుకోవలసిందే" అంది. తామరాకుపై నీటిబిందువు ఆమె కనుగొలుకుల్లో రెండు కన్నీటి బిందువులు జారి చెక్కిళ్ళనుదాటి వక్షస్థలమున లీనమైపోయినై.

"నేను చాల రోజుల్నుంచి మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. నాహృదయంలో మీకు తప్ప ఇంకెవ్వరికీ తావులేదు. కానీ ... మీకెలాంటికష్టం తెచ్చిపెట్టడం నాకిష్టంలేదు. నన్ను మాత్రం మరువకండి. రాజ్యాన్ని అడిగినానని చెప్పండి. అంటూ లేచింది."

నాకేమీ తోచలేదు. లేచాను. నిశ్శబ్దంగా ఇసకలో ఇద్దరమూ బీచిరోడ్డుదాకా నడచాము. "వస్తానండీ" అన్నది. "సరే"నన్నా. విడి పోయ్యాం. తర్వాత సుజాత విషయం చాలమట్టుకు మరచా.

తర్వాత నేను మద్రాసులో గుమాస్తాగా చేరి నపుడు మళ్ళీ సుజాత పరిచయం కలగడం, ఆమె అప్పటికి బి. ఏ ప్యాసు చేసింది. ఉద్యోగాలు సులభంగా దొరకటం మూలాన మా ఆఫీసులోనే ఓ గుమాస్తాగా చేరింది. ఎట్లైనా పూర్వ పరిచితు డనుగాన నాతో అందరికన్నా చనువుగా వుండేది. అది కొంతమందికిపడదు. ఆ సంగతి తెలిసినపుడు రాజ్యం నన్ను చీవాట్లు పెడుతుంది. మాట్లాడినా రాజ్యానికి కోపం. మాట్లాడకుండిన సుజాతకు కష్టం కల్గించినట్లౌతుంది. సుజాత హృదయం నాకు తెలుసు. ఆమె రాజ్యంకోసమై తన సుఖాన్ని వదలుకొంది. రాజ్యానికి ఈ విషయం తెలీదు. ఎలా తెలియజేయడం? ఆపుడు పూర్వ విషయా లన్నీ త్రవ్వకొన్నట్లవుతుంది. ఇంట్లో గోల ఎక్కువౌ తుంది. నామాట నమ్మేవారుండరు. చెప్పికూడ యేంఉపయోగం కన్పించలేదు. అందుచే చెప్పలేదు. కాని దినదినం సుజాత నాతో చనువుగా నుండటం ఎక్కువౌతుంది. ఇందులో చెడ్డ అభిప్రాయాలేవీ వుండుటకు అవకాశంలేదు. కాని రాజ్యం అను మానాలు మాత్రం ఎక్కువౌతున్నాయి. నిన్న మా ఆఫీసర్ను మార్చిన రోజున జరిగిన గల్లంతు ఇంతా అంతా కాదు.

నేను మాత్రం సుజాతను గురించి నా అభిప్రా యము నడవడిని మార్చుకోనడమేలేదు. ఎందుకంటే అందులో నాతప్పేమీ నాకు కాన్పించలేదు. అయితే సుజాత వద్ద రాజ్యం విషయాలేవీ ప్రసంగిం చను. ఆమె అడిగినా ముక్తసరిగ జవాబు చెప్పి ప్రసంగము మార్చివేయడం. ఆమె అప్పుడప్పుడు రాజ్యాన్ని చూట్టానికి ఇంటికి వస్తానంటుంది. నేనే ఏదో కారణంచెప్పి మార్పిస్తుండేవాడిని. ఎప్పుడో ఒకసారి నేను సుజాతను "పెండ్లిచేసుకోరాదా" అని ప్రశ్నించాను. అందుకామె ధీరత్వంగా, "ఆ మాట ఈ జన్మలో తలపెట్టను" అనేసరికి నాకాశ్చర్యమువేసి ఇంక ఆ ప్రస్తావనే తేలేదు.

ఇట్లుండగా రాజ్యం ప్రసవించే రోజులు వచ్చినవి ఆమెను పుట్టింటికి పంపేశాను. హోటల్లో భోజనం రెండురోజులకే విసుకేసింది. ఇంకసాంబారుకు స్వస్తి చెప్పి హాయిగా వండుకొని తిందామనిపించింది. ప్రతిదినం అలాగే వంటచేసుకొని భోంచేసి ఆఫీసుకు వెళ్ళేవాడిని. ఒకే ఆఫీసైనా పని తొందరచే రాజ్యం అమ్మగారింటికి పోయిన పదిరోజుల వరకూ సుజాతను కలుసుకొని శాంతంగా మాటాడ్డానికి వీల్లేకపోయింది. ఒకరోజున నాకు జ్వరం వచ్చింది. ఇంట్లో పత్యం పెట్టేవాళ్ళెవరూలేరు. ఆ మద్రాసు మహాపట్టణంలో పల్కేవారెవరూ, అప్పటికీ పక్కింట బ్బాయిని బ్రతిమాలుకొని సెలవుకాగితము ఆఫీసుకు, పంపాను. కాఫీ మాత్రం ఎట్లో తెప్పించుకొని, తాగి ఇంట్లోపడుకొని యున్నా. సెలవు కాగితము చూచికాబోలు సుజాత మధ్యాహ్నమే మాయింటికి వచ్చింది. అదే మొదటి సారి. అప్పుడు రాజ్యం ఇంట్లోవుంటే యేమవునో ... నాకే చాల ఆశ్చర్యం వేసింది.

"ఏం సుజాతా, ఇప్పుడు వచ్చేవే?" అన్నా.

"ఏం లేదు. మీకు జ్వరం వచ్చిందంటే చూట్టా నికి వచ్చా."

"ఆ.. కొద్దిపాటి జ్వరమే. యేంప్రమాదం లేదు. లెండి."

"అయినా మందు తెప్పించారా ... రాజ్యంగా రేరీ" అన్నాది వంటింటి వైపుచూస్తూ.

"నాకప్పటికి సంగతి జ్ఞప్తికి వచ్చింది." రాజ్యం కాన్పుకై పుట్టింటికి వెళ్ళింది" అన్నా.

(మిగతా 209 పేజీలోచూడుడు)

# ఉగాది పచ్చడి



శ్రీ యతిరాజం వెంటకృష్ణదాసుగారు

మున్నెందు సంసారమతి సుఖంబని జనుల్
ముదమునన్ వాంఛించి మురియుచుండ
మాధవీనింబామ్ల మాకందములఁగూర్చి
మానక చవిజూపె మాన్యులపుడు
మానసంబునఁ దాసి మరువకఁ జవిజూడ
మహినిట్లు సంసార మహిమఁ దెలిపె
మధురభాషిణి యధరమాధుర్యము బోలు
మాధవీ రుచులందు మనసుదీర
మానకఁదవులు మాకందరుచులందు
మృదుబాల భాషలన్ మించినట్లు
మరి ద్రవ్యమార్జించు మర్యాదలట్లుగను
మృదునవామ్ల రసంబు మెలసిదవులు
మధుర సంసారంపు మధ్యకష్టములట్లు
మృదునింబరుచులందు మిగులదవులు
మహినిట్లు సంసార మాధుర్యమెరిగించి
మరియొక్క భావంబు మనకు దెలుప
మచ్చుకైనను పచ్చడిమ్మహిని లేక
మాయమౌచును భోగముల్ మరియునిట్లె
మిగుల శూన్యంబుతానంచు మనకుదెలిపె
మహితధీశాలురిది దెలిసి మమత విడువ.

శర్కర, క్రొత్తమామిడికాయ, క్రొత్తచింతపండు, వేపపువ్వు అను నాల్గును ఉగాది పచ్చడిలోని ముఖ్యసామగ్రి. ఇట్లు నలువిధములైన రుచులుగల సంసారమును ప్రథమదశలో (మొదటనే) సర్వులును సర్వవిధముల సమకూర్చుకొని సంతసింపజూతురు. ఇది తెలిసినట్టి అనుభవజ్ఞులగు నార్యులీసంసారముయొక్క మాధుర్యమును మనకు దెలుపనుద్దేశించి ఉగాదినాడీ పచ్చడిని చేసి చవిచూపిరి. దీనిని చక్కగా పరిశీలింపుచు చవిచూచినవారికిది సంసారముయొక్క సుఖభోగములును దాని మహిమయును మంచిరుచులచే చక్కగా సుబోధకం బొనర్చుచున్నది. ఎట్లనన:

1. క్రొత్త మామిడికాయ క్రొత్త చింతపండు క్రొత్త వేపపువ్వులతోఁగూడి, అందుపానక రూపమైన మను శర్కర (మాధవీ) రుచి కంటికింపైనదై కమ్మని విడియమును వైచి మధురములగు మాటలచే మనసు రంజింపజేయు కులకాంతయొక్క యధరామృతము వోలి యానందదాయకంబైయుండును.

2. శర్కర చింతపండు వేపపువ్వులతో కూడి యున్న యందలి లేతమామిడి (మాకంద) రుచి సురూపులగు సుపుత్ర పుత్రికల మృదువైన (వాగ్రుచి) మాటలంబోలి యానంద మిచ్చుచుండును.

3. శర్కర మామిడి వేపపువ్వులతో గూడి యున్న యందలి క్రొత్త చింతపండు (ఆమ్ల) రుచి దారాపుత్రాదుల కెల్ల సౌఖ్యముల నొడగూర్చునట్టి ద్రవ్యార్జన యందలి మర్యాదలవలె పులుపుగా మధ్య మధ్య మరపురాక దవులుచుండును.

4. శర్కర మామిడి చింతపండులతో గూడి యున్న యందలి వేపపువ్వు (నింబ) రుచి దారా పుత్ర ధనాదులకై బడువేసటల వలె మధ్య మధ్య చిరుచేదై కటకటంబడ జేయునది. కాని దారాపుత్ర ధనాది భోగముల స్థిరములై నట్లాశర్కర మామిడి చింతపండ్ల రుచుల స్థిరములై యంతరించుతరి నావేప పువ్వు రుచి విజ్ఞానవంతుడైనముముక్షువునకు యీషణ త్రయంబెగటుగా (అసహ్యముగ) నున్నట్లగుచున్నది.

ఇంతియగాక యిట్లుగాది పచ్చడింజేసి చవి జూపినట్టివారి చాతుర్యమున ఆరోగ్య శాస్త్రము ననుసరించి యీ ఉగాది కాలమున కనువుగా విస్తరించు వాత పైత్య శ్లేష్మాదుల తగునట్లా చతుర్విధ సామాగ్రిని సమకూర్చి చప్పరించుమనిరి. ప్రయత్నముతో సమకూర్చినవి జూపియున్న యీపచ్చడినట్లు చప్పరించుచుండగనే యది మిగుల శూన్యమై ఇట్లే మీభోగములు గూడ చెప్పకనే శూన్యమౌనని సూచింపుచున్నది. కావున నిట్టి సుబోధకుల శక్తి మిగుల శ్లాఘ్యనీయమును అనుభవైక వేద్యమునై యున్నదిగదా!

# బాలాంబ

శ్రీ వేదము వెంకటకృష్ణశర్మ గారు

దండి నగరమ్ములకు ఱేఁడు కొండవీడు,
మిండ పగతుల కురిత్రాడు కొండవీడు,
చండ శౌర్యమ్మునకు రాడు కొండవీడు
మండితైశ్వర్యముల వీడు కొండవీడు॥

పేరుగల రెడ్డిదొరల షికారుకోట,
పోటు మొనగాండ్ర మగఁటిమి కాటపేట,
పలుకుజవరాలి సింగంపుఁ బైఁడిపీఁటఁ
గొండవీటిఁ బ్రతాపుఁడు గూర్మి నేలె॥

అతఁడు, చినవేమరెడ్డి, మహాప్రతాప
దహనభస్మిత శాత్రవోద్దండబలుఁడు,
వీరుఁడు, ప్రతాపరెడ్డి నా, బిరుదుఁదాల్చి,
కన్నబిడ్డలవలెఁ బ్రజఁ గాచుచుండె॥

తెలివితేఁటలపెట్టె, విద్దియలముల్లె,
పగతులకుఁ బ్రక్కబల్లెము, పాడివిడిది,
పలుకళలకద్ద, మీవులకు బరణి,
పేరుపెంపుల కడ్డి శ్రీవేమరెడ్డి॥

అతని తొలిభార్య, పుణ్యగుణాంబురాశి,
భర్తృసేవాపరాయణ, పరమసాధ్వి;
బాల్యమునఁ దలిదండ్రులఁ బాసినట్టి
మేనకోడలిఁ బేరిమిం బెంచుచుండె॥

మురిపమున, రెడ్డిదొర, బిడ్డ నరయుచుండెఁ,
గన్నవాళ్లేని లోటెఱుఁగదు నిసుంగు,
సంతులేని కొఱంత వారింత గనరు,
ఇట్లు బాలకు శైశవ మేఁగుచుండె॥

అమ్మవలె సాఁకు రాణి - మేనత్త తన్నుఁ
బతిని వెతసంద్రమున నూకి, స్వర్గ మరుగ
మిన్నువిఱిగి తటాలున మీఁదఁ బడియె
జగము గాఢాంధకార నిస్తంద్ర మయ్యె॥

అంతఁ, జినవేమపతి, సుందరమ్మ యనెడు
వెలఁది వరియించి రాణిఁ గావించికొనియె,
నామె యౌవనమద, దురాగ్రహప్రధాన,
అసహనమునకు దుంప, గయ్యాళిగంప॥

ఆమె కనుసన్న యానల వేమనృపతి
మెలఁగెనా - సరి; లేకున్న, మెలఁత కనలు
చిచ్చునకుఁ గ్రాఁగు; నౌర! కార్చిచ్చుపగిదిఁ
బగఱనేర్చు మగం, డింటఁ బంటు సతికి॥

అందములకుప్ప, బాల మేనత్తపేరిఁ
దాల్పఁదగినది; - గుణరత్నతతియ, యామె
కిడని తొడవులు; - తేనియ లొడియు నామె
పలుకు, మెత్తని మది నెచ్చెలులకు విందు॥

కురుల తేఁట్లాస్యకమలాన గునిసియాడఁ
గాంతిగల పేరు లెదను ద్రుళ్లింతలాడఁ
జీర పొంగుచ్చు లడుగులఁ జిందులాడ
నంతిపురి బాల కన్పండువగుచుఁ దిరుగు।

తేఁటితుటుముల వంకలు దీర్చు కురులు,
మేలి తెలిదామరల సిరి నేలు కనులు,
పసిఁడిచాయల కెగ్గులు పట్టు నొడలు,
వెలయు బాలాంబ, సుందరి కంటినలుసు॥

బాల సోయగ మమలస్వభావము గని
సుందరీదేవి మదిని నసూయపొగలు
నిండుకొనె, నలకన్నియ నెమ్మొగమ్ము
చవితిచందురుఁడయ్యె భూధవునిసతికి॥

వేడుకగ, మేనకోడలిఁ గూడి, యొక్క-
నాఁడు - అచ్చనగాయల నాడునప్పుడు,
రాణి, యందలి బాలమ్మప్రజ్ఞఁ గాంచి,
కినుక చెలరేఁగఁ గ్రీడ ముగించి లేఁగె॥

తనదు మేనత్త చిత్తవృత్తమ్ము, మిన్నుల
దుష్టమని బాల మదికింత దోఁపకయ్యెఁ
గడు నమాయికలకు నాత్మఁ గపటమున్నె?
పల్లమునకె కదా నిల్చు వాననీరు!

అత్త యదుపాజ్ఞలకు లోఁగి, యడఁగిమడఁగి,
సలుపు నాయమ సెప్పుచేఁతలు ప్రియాన,
బాల, పల్లెత్తుమాటైనఁ బలుకకుండ,-
నయ్యె, నది, రాణి యీర్ష్యాగ్ని, కాజ్యధార॥

బాల నెటులేని కష్టాల పాలుసేయ,
నామె లావణ్య మడుగంటు నట్లొనర్ప,
దీక్ష వహియించె సుందరీదేవి, యకట!
సుమతులకుఁ గీడు నెమకుటె కుమతివృత్తి॥

సార్వభౌముని రాణివాసమయి, యేమి?
ఎల్ల యైశ్వర్యములు విలసిల్ల, నేమి?
ఇంద్రభోగము లఱచేత నెసఁగ, నేమి?
స్త్రీకి మది మచ్చరంబుంట-చెడుపు చెడుపు!

౨

సుందరీదేవి యొకనాఁటి సందెవేళ
నన్ని విషయాలఁ దనకు సహాయపడుచుఁ
గడుపుకయి యడ్డముగ గడ్డి గఱచునట్టి
మనసుకెక్కిన యొకచేటిఁ గని వచించె:-

'కంటివటె బాల, మిన్నుమన్నుఁ గానకుండ,
అచ్చువోసిన యాఁబోతు నటు మదించి,
పట్టపగ్గాలు లేకుండ మిట్టిపడెడు
హృదయశల్యము మాకది యిచట నునికి'॥

'ఎంత యొయ్యారమే? దాని కెంత మదమె?
ఎంత కులు, కెంత సొలుగ? ఎంత టీక?
యెందటినో చూచితిమి గాని, యింతవఱకుఁ
గంటిమటె యెందు? నీలాటి తుంటపడుచు'

'తల్లిదండ్రుల దోర్లించి, తగుదునంచు
బాల్యమునఁ జేరె నిచట, నిర్భాగ్యురాలు!
అడుగుపెట్టెనో, లేదో, మేనత్త సచ్చె
నెవరి కెసరింకఁ బెట్టెనో యెఱుఁగరాదు'॥

'ఇంకఁ బదికాలములపాటు నెలమి మీఱఁ
బ్రభువువారును మేమును బ్రతుకవలయును
ననిన, నీపాపి నిటనుండి పనుపుటరవు,
నందుకు దారి తద్వివాహంబొకండె'॥

'మిక్కుటపు రాజకార్యాలఁ జిక్కియుంటఁ
బెండ్లి సంబంధముఁ గుదుర్చు పెత్తనమ్ము,
వైచి రేలినవారు మాపైని, నిదియ
తగినసమయము బాలమ్మ పొగరణంప,'

'గొప్ప సంబంధ మేదియుఁ గుదురకుండఁ,
గటికిపేదకు నీకన్నెఁ గట్టిపెట్టి,
పొగలునట్లొనర్చినఁగాని బుద్ధిరాదు,
మాకడుపుమంట వోదు నెమ్మదియు లేదు,'

దేవియుద్దేశమున కర్థమా విధమున,
యోజనము సేయుదాని యట్లుప్పరమున
పీఠికాముల్లొప్పఁ, దర్జనిఁ బెదవిఁ జేర్చి
కొలఁదితడవుండి, తలయూచిఁ, తెలివిదోఁప

చిఱునగ వెసంగ, నిట్టూర్చి, చేటి వలుకు
రాణిఁగని:-'దేవి! మీయభిప్రాయమునకుఁ
దగిన యట్లామె కర్తుఁడౌ దయితుఁ డొక్కఁ
డొప్పు మన రాజుగారి యొడ్డోలగమున?॥

అతఁడు లేకరియైన పోతన్నరెడ్డి
యినుపగజ్జెలతల్లి ప్రేమించుబిడ్డ
పుట్టుదారిద్ర్య మాతని పొత్తుకత్తె
బాలమకుఁ దమరెంచిన పతిగఁ దగును'

అనుచు నుడువగ, దేవేరి యమితమూదము
నంది, 'యోసి! యిదే నిశ్చయమ్ముసుమ్మ!
తిండికిని లేని పోతన్న, దిక్కులేని
బాలమ్ము ప్రియుండు; బళిబళీ! బాగుబాగు'॥

అధిపునకు, రాణి, తననిశ్చయమ్ముఁ దెలుప,
'నట్లయగుఁగాత'మని యె; మోహాంధుఁడాత్మ
సుకతి లేనియ మాటల సాగియుఁ గాని,
లోని విష మింత యేనియుఁ గానలేడు॥

చనుపొసంగిన, నిల్లాలు చంకకెక్కు,
మురిపమునె చూపఁ గొమరు నిపొగరునిక్కు,
పేరిమింగన, భటునకు భీతిదక్కు
నివి యెఱుంగని దొర ప్రజ నేలఁగలడె?

(సశేషం)

# అభిప్రాయాలు

శ్రీ పులిపాక బాలాత్రిపురసుందరమ్మగారు

"హా రామా! హా లక్ష్మణా! యని అశోకవృక్షం క్రింద ఆ సీత విలపించుచుండగా ఆ సమయమునందే, శ్రీరాముని బంటు అయినటువంటి, హనుమంతుడు ఆవృక్షము క్రింద సీతను చూచి ఆవృక్షముమీదికి ఎక్కి, తాను తెచ్చిన ముద్రిక ఆమెముందుకు పడునట్లు, యెటు వేతునా అని ఆలోచిస్తున్నాడు" అని. గోపాలస్వామి కోవెల్లో దీక్షితులుగారు, వాల్మీకి రామాయణంలో సీత అశోకవృక్షంక్రింద విలపించే ఘట్టాన్ని, అందరికి వినిపించాలని పెద్దకంఠస్వరంతో ఆయన శక్తివంచన లేకుండా చెవుతున్నాడు పురాణం. గాని సభలో మాత్రం, పలుచోట్ల పలు విధములుగా ధ్వనిచేస్తూనే ఉన్నారు జనం. "రాధా; మీతమ్ముడి పెండ్లికెళ్లావు కాబోలు. ఎప్పుడొచ్చావు? మీకందరికి ఏమియేం యిచ్చారు చెప్పావే కావు గదా?" అన్నది సుశీల రాధవంక చూసి.

"నేనువచ్చి వారం ఐంది సుశీలా; మా అమ్మతో సహా, ఆరుగురికి వేరు వేయి నూటపదహార్లు, కాళ్లు కడుగు వెండిపళ్లాలు, వెండిచెంబులు, బొట్టుపెట్టెలు వగైరా సామాను, మాతమ్ముడికి రవ్వ వుంగరం రేడియో యిచ్చారు. ఐదురోజులు పెండ్లి చేశారు." ఇంతలో పక్కనే కూర్చున్న విమల అందుకుని వాళ్ల పులును బాగా వంచారే అన్నది నవ్వుతూ.

"మేం వంచేదేమున్నది? వాళ్లేయిస్తామన్నారు యిచ్చారు."

"అయితే! నీకట్టెవంకీ యెప్పుడొచ్చిందే విమలా!" అన్నది సుశీల! వంకీ పట్టిచూస్తూ.

"మొన్న శుక్రవారం నోములకు యిచ్చాడు బాగున్నదిటె సుశీలా!"

"బాగానే వున్నాది. ఆబ్రహ్మ మేగా నారాళ్ల గాజులు యిచ్చేడేగాదు గదా? పెళ్లికూడ వెళ్లొచ్చాను. ఎప్పుడో యిస్తాడు."

"మీవీధికి జాజిపూలు వస్తాయిటె కమలా?" అని కమల పూవులు సవరిస్తూ అడిగింది విమల.

"మాకు రోజు వాడుగ్గా యిస్తాడు. నేను వాకిట్లో ఉన్నా లేకపోయిన, పిల్ల చేతికిచ్చి వెళతాడు. ఎప్పుడో డబ్బులు తీసుకుంటాడు."

"రేపు మాయింటికి పంపు కమలా! మావీధికి గులాబిపూలు వస్తాయిగాని జాజులురావు; తప్పకుండా పంపు."

ఇంకొకచోట, వెంకమ్మతో "ఇప్పుడు యింజనీరుగారింట్లోనే ఉంటున్నావా నువ్వు, అక్కణ్ణించి లేచావా?" అన్నది జానకమ్మ.

"అక్కడే ఉంటున్నా జానకమ్మగారు ఎక్కడన్న మంచి చోటు వుంటే చెప్పు."

"ఏం, వాళ్లుమంచివాళ్లు కారూ?"

"అబ్బా ఆమెదగ్గిర చెయ్యటం చాలా కష్టం వెంకమ్మా."

"ఏమికష్టం? ఏమంటుందేమిటి?"

"ఏమనాలి? ప్రొద్దుగూకులు కూర్చోకుండా చెయ్యమంటుంది. అట్లా చేసినా ఆమెకు మెప్పులేదు. అది బాగుండలేదు. ఇదిబాగుండలేదు. అని ప్రొద్దుగూకులు విసురుతూనే ఉంటుంది. పసిపిల్లల కంచాల దగ్గిరనుంచి దేవతార్చనదాకా, పక్కదాన్నే చెయ్యాలి. నాప్రాణం విసుగ్గా ఉందమ్మ. డబ్బిస్తే మాత్రం అట్లా ఏడిపిస్తుంటె కష్టంగాదూ? ఎన్ని రోజులనుంచో అడుగుతుంటె ఇక్కడికి యివాళ

పంపింది. ఎక్కడనాన్నా కుదిరితే చేస్తానమ్మా, నీవున్నావంటె హాయిగా ఉన్నావు తోచినపని చేస్తూ వాళ్లల్లో కలిసిపోయి.''

"అ! అంతామంచే మనం సరుకు పోతుంటే వంట దగ్గిరికి వెళితె వాళ్లింట్లో ఎంతకష్టమో నీకేం తెలుసు? కొందరికి నూనె వేపుడు, కొందరికి నేతివేపుడు, కొందరికి బంగాళాదుంప, కొందరికి తోటకూర, కొందరికి వేపుడు కూర, యింతలో అల్లుడొస్తే యింకో ప్రత్యేక కూర. ఎన్ని చేసినా ఒక్కటి మిగలకూడదు; తగలకూడదు. అతిజాగ్రత్తగా చెయ్యాలి. యింతా చేస్తే చేసినవాళ్లకు ఒకరోజు మిగులుతుంది; ఒకరోజు మిగలదు. ఇల్లాంటివి యేం చెప్పుకుంటాం? పురాణం అయిందాక ఉండటానికి వీల్లేదు యివ్వాళ సినిమాకు వెళతారట. తొందరగా వంట కావాలి, నే వెళతాను. నువ్వుంటావా వెంకమ్మగారూ?''

"నేను వెళతనండీ, ఆలశ్యమైతే ఊరుకోరు" అని ముసుకు సవరించుకుంటూ లేచింది జానకమ్మ. యిద్దరూ వెళ్లిపోయినారు."

"ఏం నిద్రవస్తున్నట్లున్నది రాత్రి భాగవతానికి వెళ్లారా? అన్నది తట్టిలేపుతూ" శేషమ్మగారు.

"సూరమ్మగారు త్రుళ్లిపాటుతో కళ్లుతెరచి ఏమిటి శేషమ్మగారూ ఏదో అట్లా కన్నంటింది. సరేగాని మీకోడలు వెధవచెల్లెలి పెండ్లికెళ్లిందిటే! వచ్చిందీ?"

"అ వచ్చిందమ్మ మొన్ననే వచ్చింది."

"ఆవిడ వంటచేస్తే నువ్వు తింటున్నావుగా?"

"ఒకనాడావిడ నాకొండి పెట్టిందీ? ఎప్పుడూ నేనె వండుతాను. అయినా తినక తప్పేదేమున్నది?"

"అ యిందులో యేంతప్పున్నదిలే. సోమయాజులుగారి కొడుకు వెధవముండను పెండ్లిచేసుకొచ్చాడుట. ఇప్పుడు ఆ మామగారి దేవతార్చనకుకూడా ఆ అమ్మాయే వంటచేస్తుందిట. అంతకంటె మనమేం ఎక్కువైన వాళ్లమా? అంతా కలిసేపోయింది; ప్రపంచం మాలకూడైంది. ఎవరి నన్నా కదలించు గాంధిగారు చెప్పారంటారు. ఆయన మాత్రం కుల భ్రష్టుల్ని కమ్మన్నారా? ఐకమత్యంగా ఉండ మన్నారుగాని."

"ప్రొద్దు గూకుతున్నది సూరమ్మా! యింటి కెళ్లాలి."

"ఇంట్లో కోడలుందిగా? ఉండు పురాణం ఐందాక - వెళదాం."

"కోడలుంట్లే మాత్రం నాకేం లాభం? నా వంట నాపని నాదే. రెక్కలాడినన్నాళ్లు చేస్తే తరువాత తిప్పలు భగవానునకే ఎఱుక. కొడుకు ఫలహారం చేసివెళ్లగానె తాను ముస్తాబై వెళుతుంది. వాడు ఇంటికొచ్చేవేళకు వస్తుంది. ఒక్కొక్కరోజు కూడానే వస్తారు. ప్రొద్దుకూకుతుంది. పెద్ద పిల్లలు అన్నానికేడుస్తూ ఉంటారు. పసివాడు పాలకేడుస్తూ ఉంటాడు. పెరుగు తెచ్చేవాళ్లు పాలుతెచ్చేవాళ్లు నుంచుంటారు. దీపాలు వెలిగించాలి. నేనుమాత్రం బుడ్డిదీపం వెలిగించుకుని వంటయింట్లో నాపని నేను చేసుకొని రామాకృష్ణా అనుకుంటూ కూర్చుంటా. ఇంత చిరాకుగా యిట్లఉన్నా, పిల్లలు ఏడుస్తున్నా అదేమి? అనడు వాడు. అల్లాంటప్పుడు నాకు మాత్రం ఎందుకు? నేను చూస్తూ ఊరుకుంటా. అన్నాలు పెట్టమని వంట యింట్లోకివస్తే పెడతా. అందాక ఆ గొడవ నేనేమి కలుగజేసుకోను నాకెందుకు?"

"ఊరుకోక మనకెందుకు? మా యింట్లో తంతు అంతా యింతే మనకేం కావాలి పోదూ! వస్తారా? హారతిస్తున్నారు వెళదాం."

"ప్రసాదం తీసుకోరూ?"

"మనకందదులెండి" అన్నది శేషమ్మగారు ఇద్దరు కొంగుడులుపుకొని కబుర్లు చెప్పుకుంటూ వెళ్లారు. యింతలో దీక్షితులుగారు లేచి "అమ్మా సభాతల్లులందరికి నా నమస్కారములు. సభలో యింత అలజడి చేస్తుంటే పురాణం చెప్పటం చాలా కష్టం. సీత లంకలో ఉండగా రాములవారి ముద్రిక హనుమంతుడు సీతకు యిచ్చే ఘట్టం యిప్పుడు వచ్చింది.

గనుక తల్లులందరు యెవరి శక్తికొలది వారువేసి ముద్రిక చేయించి తెచ్చి ప్రత్యక్షముగా సీతను సమర్పించి, సావకాశంగా రేపు పురాణ శ్రవణము చేయుదురని నమ్ముచున్నాను" అని స్వస్తిచెప్పి, దీక్షితులుగారు పురాణం ముగించి, పుస్తకం చంక బెట్టుకొని వెళ్లారు. అందరు లేచి యెవరిండ్లకువాళ్లు వెళ్లిపోయినారు.

౨

మధ్యాహ్నం మూడుగంటలైంది. ఇన్‌స్పెక్టరు గారి అత్తగారు భగవద్గీత చదువుకుంటూ భోజనాల హాల్లో కూర్చున్నది. ఇంతలో డాక్టరు గారితల్లి అన్నపూర్ణమ్మగారువచ్చి అక్కడేఉన్న పీటమీద కూర్చుని తానుకూడ ఆ పేజీలవంక చూస్తూ "మాణిక్యమ్మగారు కాలాన్ని ఒక్క క్షణంకూడా వృథా పోనీయరు. ఏమండి! ఈ మధ్య పురాణానికే మనాన్ని వెళుతున్నారా? యివ్వాళ వస్తారా?" అన్నది ఆమె వంకచూస్తూ అన్నపూర్ణమ్మగారు.

కళ్లద్దాలు పైకి తీసుకొని "మీరు ఊరునుంచి ఎప్పుడు వచ్చారు అన్నపూర్ణమ్మగారూ? అన్నది మాణిక్యమ్మగారు పుస్తకం క్రింద పెడుతూ."

"నిన్న వచ్చానండీ."

"మొన్న ఒక రోజు పురాణానికి వెళ్లానుగాని, అక్కడ విననిస్తారా? వినపడుతుందా? వచ్చిన వాళ్లంతా వాళ్లవాళ్ల యిండ్ల దగ్గిర కబుర్లన్నీ పురాణం దగ్గిరే చెప్పుకుంటారు. వాళ్లు వినరు యింకొకళ్లను విననివ్వరు. అందుకని మళ్లీ వెళ్ల లేదండి. ఆ రోజుతోనే పురాణం చాలనిపించింది నాకు. నిన్న మా అమ్మాయితోకూడ సమాజానికి వెళ్లాను. అక్కడ సావకాశంగా కూర్చున్నా, విన్నా. విన్నది మనస్సుకు పడుతుంది. ఆ రాజేశ్వరమ్మగారు భారతం చదివి అర్థం చెపుతుంటే అంతా మనకళ్ల కపుపడ్డట్లే ఉంటుంది."

"ఏం చెప్పింది మాణిక్యమ్మగారు. కొంచం చెప్పండి వింటాను."

"భారతం అంతా యీ తత్వానికి సరిపుచ్చింది. ఈ దేహామే కురుక్షేత్రం. హృదయమే రథము. జీవాత్మ అర్జునుడు, పరమాత్మ కృష్ణుడు. బుద్ధి ధర్మరాజు. మనస్సే భీముడు. చిత్తం నకుల సహదేవులు. శాంత, శమ, దమాది గుణములే పాండవుల సైన్యము. అహంకార, క్రోధడంబ, అసూయ, మదమత్సర్యాది ప్రవృత్తులన్నీ, దుర్యోధనాదులనే కౌరవులసేన. జీవాత్మ అనే అర్జునుడు, హృదయమనే రథము ఎక్కి, పరమాత్మ అనే కృష్ణుని రథసారధ్యముచేత ఆయుధ రంగమునందు ఓంకారమనే రణభేరి మ్రోగించి, దుర్యోధనాదులనే దుష్టప్రవృత్తులను శాంతమనే బాణముచేత సంహరించి జీవాత్మ అనే అర్జునుడు, కృష్ణుడనే పరమాత్మలో చేరాడు. అని యిల్లాగే యెన్నో చెప్పింది ఆమె. నాకన్నీ జ్ఞాపకం ఉండవండి. మీరడిగారు గనుక ఏవో రెండు ముక్కలు చెప్పాగాని; నాకు మాత్రం అన్నీ జ్ఞాపకమున్నయా అన్నపూర్ణమ్మగారూ?"

"అవునండీ మాణిక్యమ్మగారు విని గ్రహించే వాళ్లకు ఎక్కడైనా ఉన్నది. అగుళ్లో చెప్పే దీక్షితులుగారు కూడా యిల్లాగే చెప్పారు రామాయణమంతా. ఈశరీరమే తొమ్మిది ద్వారములుగల అయోధ్యా పట్టణము. దీనికి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములనే షడ్వర్గములు. ఆరు ప్రాకరములు. షడ్చక్రములనే, ఆధార, స్వాధిష్ఠ మణిపూరక, అనాహత, విశుధ, ఆగ్నేయ, ఆరు అంతస్తులమేడ, దానిలో మనస్సనేగది. దానిలో జీవుడనే రాముడు. ఆ శ్రీరామచంద్రుడు, సుగుణమనే గొడ్డలిచేత, దుర్గుణమనే అడవి నరికి, సంసారమనే సముద్రమునకు, సత్వగుణమనే వారధికట్టి, శాంతమనే కోదండముచేతబట్టి, అహంకారమనే రావణుని, సంహరించి, పరమాత్మ అనే రాముని కొరకు విలపించుచున్న, ముక్తికాంత అనే సీతను పరిగ్రహించి, సహస్రారమనే వేయిరేకులుగల, పుష్పక విమానమెక్కి, జీవాత్మ అనే శ్రీరామచంద్రుడు, ముక్తికాంతతోసహా, పరమాత్మలో చేరెను, అని యిల్లాగె ఎన్నో చెపుతారు ఆయనగారు

కూడాను. కాని మీరుచెప్పినట్లు వినలేరు. ఎప్పుడో ఒకరోజున కొద్దిజనం వస్తే? మనం దగ్గరగాకూర్చుంటే ఇల్లాగె రెండుముక్కలు వినపడతాయి. అయితే మీరు రారన్నమాట?”

“అవునండి రాను.”

“మాకోడలు కూడా, ఎప్పుడు యిల్లాగె అంటూ ఉంటుంది. గాని నేనెప్పుడు సమాజానికి వెళ్ల లేదండి అక్కడేవో ఆటలు పాటలు, నవలలు చదువు కోడం అని నానమ్మకం.”

“అవును; అవీ వున్నాయి. వారానికి రెండు దఫాలు పురాణ కాలక్షేపం ఉంటుంది.”

“మళ్లీ మీరు వెళ్లేటప్పుడు నాక్కూడ కబురు చెయ్యండి వస్తాను.”

“అల్లాగే లెండి.”

“ఇక యివాళ, యింటి కెళతాను. ఈకబుర్లతో చాల ప్రొద్దు గడచి పోయింది.

(సశేషము)





*

#  పట్టుచీరె 

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

రేడియోవారి సౌజన్యముతో

మల్లెమ్మ ఇంటి సావిటిలోకివచ్చి "ఏమ మ్మోయి! కామాక్షమ్మ వదినా! మా అబ్బాయి పుట్టినదినం రేపు. పేరంటానికి తప్పకుండా రావాలమ్మోయి!" అంటూ కుంకంబరిణతీసి కామాక్షమ్మకి బొట్టు

"ఔనుగాని, పట్టుచీర ఎంతకి కొన్నా వమ్మోయి!" అని కామాక్షమ్మ విక సించిన మొహంతో అడిగింది.

"మైసూరు పట్టుచీర నలభైరూపాయ లిచ్చి మావారు తెచ్చిపెట్టేరమ్మా!" అంది మల్లెమ్మ.

"చూడ ముచ్చటగా ఉంద మ్మా మల్లెమ్మ వదినా! చుట్టూ జరీకమ్మి, పమిటి కొంగున జరీ! నలభైకి చవకే!" అంది కామాక్షమ్మ.

"సరి! చవకనా! మోజుకొద్దీ కొన్నది గాని నాకీ రంగంటే ఇష్టమమ్మా!" అని "ఊరికే లాంఛనానికి పిలిచింది మల్లెమ్మ అని ఎగకొట్టేవుసుమా! తప్పకుండా రావాలి!" అంది మల్లెమ్మ.

"మా మేనల్లుడి పుట్టినరోజు వేడుకకి నేను రాలేదే అనుకో! ఏమిటి చేస్తావో చెప్పుదూ అయినా" అంది కామాక్షమ్మ వేళాకోళానికి.

"ఏమిటి చేస్తానా! మా అన్నగారితో చెప్పి మంచిచీర కొనిపించి, వద్దన్నా సరే కట్టించండని మరీ మరీ చెప్తాను" అంటూ మల్లెమ్మ వీధివైపుచూసి కంగారుగా "పొద్దులేదమ్మోయి! ఇంకా బోలెడన్ని ఇళ్లున్నాయి. ఇంటి దగ్గిర చంటిపిల్లాడు గోలపెట్టేస్తూంటాడు!" అని మారు ఆలో చనలేకుండా తిరిగిపోయింది.

మల్లెమ్మ కనబడినంత దూరం కామా క్షమ్మ ఆపట్టుచీరె వైపే చూస్తూ నిలుచుంది. తానూ ఆలాంటి చీరె కొనుక్కోవాలను కొంది. కాని ఏమిటిపెట్టి కొనుక్కోం టుంది? చేతిలో రాగిదమ్మిడీ లేదు. "ఇవాళే మా ఆయనకి జీతం అందుతుంది. ఏదో ఒక ఉపాయంపన్ని కొంచెం వెనక్కి వేస్తాను" అనుకొంది.

ఆమె భర్తయైన శివపాదం కలెక్టరాఫీ సుల్లో గుమాస్తాగా ప్రవేశించి రెండేళ్లు మాత్రమే అయింది. గాజులబేరం భోజ నానికి సరి అన్నట్లుగా సంసారం నడు స్తూంది. అయినా కామాక్షమ్మ బోలె డంత పొదుపుచేసి కూడిక చెయ్యాదలుచు కొంది. సాయంత్రం వంటపెందరాడేచేసి తీరుబాటుగా కూర్చుంది.

శివపాదం గుమ్మంమెట్లెక్కేడు. అతని కోసం ఆదుర్దాగా ఎదురు చూస్తూన్న కామాక్షమ్మ గభాలునవెళ్లి తలుపుతీసింది.

నవ్వు మొహంతో భర్త ఇంటిలో అడుగుపెడుతూ "ఇవాళ ఏదో విశేష ముంది!" అన్నాడు.

"రోజూ ఉన్న విశేషమే! కొత్తదేదేనా ఉంటే మీరు చెప్పండి!" అంది భార్య తన ఆలోచనలు బైటపెట్టకుండా.

"కొత్త విశేషమా? ఇవాళ గుమాస్తా లంతా టీపార్టీ చేసుకొన్నారు. నావాటా అర్ధరూపాయి వదిలింది" అన్నాడు.

"అయ్యో! అయ్యో! అప్పుడే విఘ్నేశ్వరపూజ అయిందీ!" అంటూ ఆశ్చర్యపోయింది ఇల్లాలు.

"అందరూ టీపార్టీ చేసుకొంటూంటే నన్ను అక్కడినుంచి లేచిపొమ్మన్నావా? లేకపోతే వాళ్ల మొహాలు చూస్తూ కూర్చోమన్నావా?" అన్నాడు భర్త.

"సరే కాని ఇంటి ఖర్చు లేమవుతాయని నేనడగడం?"

"రోజూ ఉన్నదే కాని ఇవాళ కొత్తది కాదుకదా!"

"అయినా మీచేతిలో దమ్మిడీ ఉండదంటే నమ్మండి!"

"నన్నేమి చెయ్యమన్నావో చెప్పుదూ, పోనీ."

"మొదట భోజనానికి లేవండి! తర్వాత మాట్లాడుకోవచ్చు" అంది భార్య.

శివపాదం కాళ్లు కడుగుకొని మరొక వస్త్రం ధరించి భోజనానికి లేచేడు.

అతను భోంచేస్తూండగా కామాక్షమ్మ "మనం నెలకొక పదిరూపాయలేనా వెనక్కి వెయ్యాలండి!" అంది.

"ఆలోచన మంచిదేకాని ఏలాగు చెయ్యమన్నావు?? నాకు చేతకావడంలేదు. ఇప్పుడు మనంచేసే ఖర్చులలో ఏది తప్పుతుందో చెప్పు?" అని అడిగేడు భర్త.

"తప్పని వాటికి ఖర్చు తగ్గించి చేద్దాం" అంది భార్య.

"ఇన్ని మాటలెందుకు! నాకు ఫలానా అంశంలో ఖర్చు తగ్గించుదాం అని చెప్పుదూ!"

"లచ్చన్నగారింటిలో ఎవ్వరూ కాఫీలే త్రాగరు. మన ఇంటిలో రెండుమార్లూ తప్పడంలేదు. దానివల్ల కడుపు నిండేనా, కాలు నిండేనా?" అంది భార్య.

"అయితే ఏంచేద్దామంటావు?"

"రేపటినుంచి ఒక్కపూట తాగవలసిందే! రెండోపూట బంద్. మీరు సాయంత్రం ఇంటికి వచ్చి రావడంతోటే చక్కగా భోంచెయ్యండి. ఆ ఉద్దేశంతోటే నేను ఈ పూట కాఫీకి నీళ్లుపెట్టలేదు" అంది భార్య.

"ఆ సంగతి ముందే తెలిసి నేను టీ పార్టీలో పాల్గొన్నాను" అని శివపాదం "సరే బాగానే ఉంది. తర్వాత?" అని ప్రశ్నించాడు.

"మీరు మధ్యాహ్నంపూట కాఫీ హోటేలుకి వెళ్ళవద్దు. ఇంటి దగ్గిరే ఏదో ఒకటి చేసిస్తాను. అది పట్టుకువెళ్ళి తిని, ఇన్ని మంచి నీళ్లు త్రాగండి!" అంది కామాక్షమ్మ.

"అంతా నాఖర్చుతేకాని నువ్వుచేసే వేమీ నీకు కనబడడంలేదు పాపం! పొయ్యిలో కర్రలమీద నిప్పుపడేసి అవి సగం కాలిపోయేదాకా గిన్నె పెట్టనే పెట్టవు?" అని ఆక్షేపించాడు శివపాదం.

"అదేమో! మా అమ్మలాగే చేసేదండి! అందుచేతే నేనూ అలాగే చేస్తున్నాను" అంది భార్య.

"మీ అమ్మ చదువుకోనిది. నువ్వు ఏదో శాస్త్ర వెలిగించేవు కాదూ! అందుకని నువ్వు కర్రలు వెలిగిస్తూన్నావు అంతేనా?" అని భర్త వెటకారంగా అన్నాడు.

"ఎందుకులెండి. దానిని గురించి నేను జాగ్రత్త పడతానుకాదూ" అని కామాక్షమ్మ మాట ఇచ్చి "మనం కొనుక్కునే కూరగాయలలో కొంత పొదుపు చూపించాలండి!" అంది.

"ఏమో స్తరుగా?" అని ప్రశ్నించేడు.

"ఖరీదైన కూరలు తెచ్చుకోడం మానివేసి, ఏది చౌకగా ఉంటే అది కొనుక్కొందాం."

"అది చెప్పేవు ఇంకా బాగుంది. అది మంచి సలహాయే!" అని శివపాదం మెచ్చుకొన్నాడు.

"నేతి ఖర్చొకటి అధికమయి పోతూందండి. పోనీ అని మనకి అందుబాటులో ఉన్న మూడోరకం నెయ్యి కొనుక్కుంటే దాని పరిమిళం భరించలేకపోతున్నాం. అంచేత నెయ్యిబదులు నూనె వాడుకొంటేనే మంచిదేమో!" అంది భార్య.

"ప్రతి దానిని ఒక్క మాటుగా ఎక్కడ విడిచిపెట్టగలం. ఖర్చు కొంచెం కొంచెంగా తగ్గిస్తూవచ్చి చివరకి సాధించుదాం!" అని శివపాదం ఉపాయం చెప్పి "ఎంతసేపూ తిండిలో తగ్గించుకొని కడుపుమాడ్చుకోడమేనా, మరేమేనా ఉందా?" అని చీదరించుకొన్నాడు.

"మీరు ఆఫీసునుంచి ఇంటికి, ఇంటినుంచి ఆఫీసుకి బళ్ళ అద్దెలు విపరీతంగా పెట్టేస్తున్నారు. ఆఫీసు రెండుమైళ్ళదూరం ఉంటే మట్టుకు, ఇహాముందు నడిచివెళ్ళవలసిందే!" అని బిగించి చెప్పింది భార్యామణి.

"నడవడం సాధ్యమా!" అని వెర్రి మొహం పెట్టేడు భర్త.

"మీరు ముందెప్పుడో సైకిల్ కొనుక్కునేదాకాకూడ తప్పక నడిచివెళ్ళవలసిందే!" అని ఖండితంగా చెప్పింది ఇల్లాలు.

"పోనీ ఒకప్పుడు కాకపోయినా ఒకప్పుడేనా నడుస్తూంటే ఒంటికి ఆరోగ్యంకూడా. నడవడం రెండు విధాలుగా లాభం!" అని శివపాదం అర్థాంగీకారం సూచించేడు.

శివపాదానికి కొంచెం వెష్టపుట్టింది. తప్పకుండా పొమపుచేసి కూడిక చెయ్య దలుచుకొన్నాడు. అతను తలకి పట్టించుకొని "చాకలి ఖర్చేమేనా తగ్గించ గలమూ?" అని అడిగేడు.

భార్య "అవశ్యం!" అని "ఇప్పుడే మొదలుపెట్టి చూద్దాం. మీగుడ్డలు, నా చీరెలుకలిపి ఉడకవేస్తాను" అంది.

"కొత్త పూజారిత్వం! కాస్త జాగ్రత్తగా చెయ్యి?" అని భర్త హెచ్చరించాడు.

అప్పటికి చర్చ ముగిసింది.

కామాక్షమ్మ మచ్చుకి భర్తయొక్క తెల్లషర్టు, తెల్లపంచ, తన రంగు చీరెలు రెండు, బిందెలో వేసి, పొగతో అవస్థపడుతూ ఉడికించింది. పైకి తీసి చూసింది. తన కళ్లను నమ్మలేక పోయింది. షర్టు, పంచకూడ రూపు లేకుండా పోయేయి. ఎరుపు, ఆకుపచ్చ ఇంకా వింత వింత రంగులు పులుముకొన్నాయి. కామాక్షమ్మకి నోటమాటరాలేదు. శివపాదానికి నోరు మూతపడలేదు.

(సశేషము)




'బ్రహ్మమయం జగత్'. ప్రపంచము బ్రహ్మమయము. బ్రహ్మమును వ్యక్తము, అవ్యక్తము అని నిరూపించుచున్నాము. వ్యక్తిగతము కాని దంతయు నిర్గుణ బ్రహ్మమని నిరూపింపబడుచున్నది. అయితే అది నిర్గుణముగ నుండక సగుణముగ సదా మార్పు చెందుచున్నది. అట్టి సగుణ బ్రహ్మ పూర్వస్థితిని శూన్యము (Vacuum) అందురు. శూన్యజనిత శక్తి (Energy) యే 'ఆది' (Origin) లేక నాదబ్రహ్మమనబడును. ఇదియే 'గోళగత గానము' (Music of the spheres) షేక్స్పియరు (Shakespeare) సూచించియున్నాడు.

సర్వవిద్యలకు వేదములు మూలప్రమాణములు. సంగీతమునకు సామవేదము ఆధారము. భరతుని నాట్యశాస్త్రములోను, శారంగదేవుని 'సంగీత రత్నాకరము' లోను సామవేదము పేర్కొనబడియున్నది. ఋగ్వేద పూర్వదశలో స్వరనాదము ప్రథమమున ఉపయోగించినట్లు తెలుస్తున్నది. ఋక్కులు వేదప్రోక్త దేవతా ప్రార్థనలు. వీటిని స్వరమిళితము చేసి పాడిన శ్రావ్యముగనుండి పలుకుటను ఉచ్చరించుటలో మాధుర్యముగనుండిన కారణముచేత ఋక్కులను స్వరయుక్త అధ్యయనముగ చేయగడగిరి. అనేక వేదశాస్త్ర పరిశోధకులు - శ్రీ తిలకు, కేల్కారు మున్నగువారు 4,000 క్రీస్తుశకము పూర్వమే త్రివిధ స్వరములు ఋక్కులలో వాడబడినట్లు తెలిపియున్నారు.

నాదమునుండి స్వరములు ఉత్పత్తి అయినవి. స,రి,గ,మ,ప,ద,ని అని సప్తస్వరములు ఏర్పడినవి. స్వరమిళితమైనది రాగము. ఈ రాగ జ్ఞానము సంగీత శాస్త్రము లేక గాంధర్వవిద్య అనబడును. "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణి" అనుటవలన అత్యంత తన్మయత్వము కలుగచేయు గుణము దీనియందున్నది. తన్మయమే కాదు, దేహ, మనోజాడ్యంబులనుగూడ తొలగించునట్టి శక్తి గానమునకున్నది.

సంగీతశాస్త్రము ఉపవేదములలో నొకటి.

పూర్వమునుండి సప్తస్వరములు బీజాక్షరయుత దేవతా స్వరూపములని భావింపబడినవి. ఇట్లు పూజించి స్వరజ్ఞానసిద్ధిని కొందరు పొందినట్లునూ తెలుస్తున్నది. 'దీపకళిక' రాగముచే దీపమును స్వాధేవ వెలిగించిరట. శ్రీ ముత్తుస్వామి దీక్షితులు 'అమృతవర్షిని' అను రాగములో 'ఆనంద మృతకర్షిని' అను నొకకృతిని రచియించిరి. దీనిని ఈ రాగ నిజస్వరములతో పాడి అమృతవర్షము కురిపించిరని వదంతి. 'మేఘరంజని' అను రాగంబుచే మేఘములు గర్జించి వర్షించుటకూడ వినియున్నాము. ఉత్తర హిందూస్థానములో దీనికి సరియైన రాగము 'మేఘ్ మల్హార్' అని ఒకటి ఉన్నది. మొగలాయి చక్రవర్తియగు అక్బరు కాలములో టాన్సన్ అను గాయకుడు ఉండెను. అతనికి 'దీపక్' అను రాగము చక్కగ తెలియుననియు, అది తాను పాడిన అగ్ని ప్రమాదము వచ్చుననియు పాడకుండెనట. ఒకనాడు అక్బరు చక్రవర్తి తన కుతూహలము తెలిపి పాడమని కోరగా, అప్పుడు తాను చక్రవర్తిమాటను త్రోసివేయలేక జమునానదిలో నిల్చబడి 'దీపక్' రాగము

పాడగా ఆ నదీజలము త్రుళ్ళి బుగబుగ పొంగెనట. ఆ పొంగులో టాన్‌సన్ అదృశ్యుడయ్యెనని వాడుక. అమెరికా ఖండములో నొక హూణగాయకుడు 'పియానో' ఒకనాడు అరణ్యసంచారియై అక్కడ దానినిగొనిపోయి వాయించగా బల్లులు, గుంపులు, గుంపులుగ వానిని క్రమ్ముకొనెనట. 'గౌళిపంతు' రాగ సిద్ధి వానికి లభించెనేమో? ఈ రాగస్వరములకు ప్రభావమెట్టిదో?

సప్తస్వరములలో నడిమి అక్షరము 'మ' - ఇది మమకారము సూచించుచున్నది. జీవునికి మమకారము మాయ. ఈమాయవలన జ్ఞానము భ్రష్టమైయున్నది. జ్ఞానవికాసము కలుగవలెనంటె మాయను జీవుడు జయించవలెను. ఈ మాయాజితత్వమును స్వరమేళన ములైన రాగములచే పొందవచ్చును. కాన నాద బ్రహ్మజన్యములైన స్వరములచే తిరుగ బ్రహ్మమును పొందగలము. 'సర్వం బ్రహ్మార్పణమస్తు' యన ఇదియే అర్థము. ఈసప్తస్వరములను సాధారణముగ పాడునప్పుడు వాటి అంత్యమున ఒక 'స' చేర్చి సప్తపదిని అష్టపదిగజేసి స్వరజ్ఞానము, రాగజ్ఞానము పొందుచున్నాము. అష్టపదియందు అన్వయించు 'స' జీవస్వరమనియు, పురుషస్వరమనియు అన వచ్చును. 'స' షడ్జస్వరము. దీనినుండి షట్‌స్వర ములు జనించినవి. ఈ జీవస్వరమిళిత సప్తస్వర మేళనమైన రాగగానము పురుషార్థసాధనము. ఇట్టి సంగీత సాహిత్యవిద్య మోక్షదాయకమైన విజ్ఞాన మును ఇచ్చును.

సప్తస్వరములలో మధ్యనున్న 'మ' స్వరము ముందు స,రి,గ, అను స్వరములునూ, దానివెనుక ప,ద,ని, అను స్వరములునూ ఉన్నవి. స,రి,గ,ప,ద,ని ఈ 6 స్వరములు, 6 అభేద్యపద్యములుగనుండి 'మ' అను మమకారశక్తి కేంద్రమును అభేద్యముగ చేయు చున్నవి. ఈవజ్రపద్యములను 'స' అను షట్ స్వరూపపురుషేశ్వరబలముచే భేదించనగును. వజ్ర మును వజ్రముచేతనే గదా భేదించుచున్నాము. అట్లే మాయాభ్రష్టయుతశక్తి "మ" కేంద్రమును "స" అను షట్‌స్వర పుంభావమువలన భేదింపగలము. అపుడు నిర్మలమైనట్టియు, భ్రష్టరహితమైనట్టియు శక్తికేంద్రమును పురుషుడు పొందును. ఈ పురుష శక్త్యైక్యతవలన నాదబ్రహ్మమునూ పొందుదుము.

మరియు "మ" సప్తస్వర మధ్యగతమైన స్వరము "మ" శక్తి,లేక, 'లక్ష్మి,' స్థానమును అనవచ్చును. స్త్రీలను అబలలని చెప్పుటవాడుక. పురుషుడు తనబలమ్మునకు మీరినకార్యము తలపెట్టి నిర్వహింప లేక విముఖుడగుచున్నాడు. సాధారణముగ తనకు ఆకార్య నిర్వాహమునకు 'శక్తి' లేదని చెప్పు చున్నాడు. "మ" స్వరము శక్తికేంద్రము. అది అబలస్థానమనియు నిరూపింపవచ్చును. అట్టి 'మ' కేంద్రమునకు ఆద్యంతముల 'స' అనుజీవ (పురుష) స్వరమును చేర్చి "స,రి,గ,మ,ప,ద,ని స" అని అష్ట స్వరములు కల్పించి సంపూర్ణ స్వరములుగ భావించు చున్నాము. కాన కేంద్రమైన 'మ' స్థానము రెండు అంశములు పురుష (స) బలముకలదై బలవత్తరమైన కేంద్రమగుచున్నది. కాన 'మ' స్థానము అబలత్వ రహితమై పురుషతత్వమున్నూ గల కేంద్రమగుచున్నది. అట్లు "మ" కేంద్రము 'శక్తి', 'పురుష' తత్వ యుక్తమై అర్ధ నారీశ్వరత్వమును పొంది బ్రహ్మాండ సృష్టికి కారణభూతమైన నాదబ్రహ్మ స్థానమగు చున్నది. పురుషుడును (స) ఆది మధ్యాంతస్థితుడై 'శక్తి' (మ) యుతుడై అర్ధనారీశ్వరతత్వమును పొందుచున్నాడు. అట్లు అర్ధనారీశ్వరత్వము పొంది 'శక్తి', 'పురుషుడు', జీవన్ముక్తులగుచున్నారు. శ్రీ కాకాభుజండ మహర్షి కావుననే "శివన్ముక్తియే జీవన్ముక్తి" అని పాడియున్నాడు. అనగా శివునికి ముక్తివచ్చినగాని జీవునికి (మానవునికి) ముక్తిరాదు. ప్రకృతి పురుషైకత్వము, 'ముక్తి', శ్రీ శంకరా చార్యులవారి ఏకత్వతత్వము - "ఏకమేవాత్ అద్వి తీయం బ్రహ్మ". మానవునికి ఇట్టి శాశ్వతమైన ముక్తి, ఈశ్వరత్వము, బ్రహ్మజ్ఞానము, గానము వలన కలుగును.

స,రి,గ,మ,ప,ద,ని,స - అను స్వరములకుఆద్యంత ములనుండు 'స' స్వరమును 'మ' అను స్వరమునకు

ముందు చేర్చిన 'సమ' అని అగుచున్నది. 'సమ' అనగా సమత్వము. సంగీత సాధనవలన సమతత్వము కూడ లభించును. ఇట్టి సమతత్వము యోగుల గుణాతిశయముగదా? కాన గాయకులను యోగులుగజేయు శక్తి గానమున కున్నది. శ్రీ త్యాగయ్య యొక మహాయోగికదా?

"ఇహైవ తైర్జితః సర్గో
యేషాం సామ్యేస్థితంమనః
నిర్దోషం హిసమంబ్రహ్మ
తస్మాద్ బ్రహ్మణి తేస్థితాః"

సర్వభూతస్థమాత్మానం
సర్వభూతా నిచాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః॥

ఆత్మౌపమ్యేన సర్వత్ర
సమంపశ్యతి యోర్జున॥

సుఖంవాయదివా దుఃఖం
సయోగి పరమోమతః

సమతత్వ మనస్సుకలవారిచే ఇహమునందే సర్వము జయింపబడుచున్నది. బ్రహ్మతత్వము నిర్దోషమై సమతత్వము గలిగియున్నది. కాన అట్టి సమతత్వులు శాశ్వతత్వము పొందుచున్నారు. గానము ఈశ్వర తత్వమై తన్మయత్వము, ఆనందము కలిగించును. ఇదియే నాదబ్రహ్మ జనితమైన బ్రహ్మనందము. వ్యక్తిగతమైన సగుణనాద బ్రహ్మము. నాదబ్రహ్మో పాసనవలన బ్రహ్మతత్వమును మానవుడు పొందగలడు. కాన మానవుడు శాశ్వతమైన జీవన్ముక్త త్వము పొందును. జరామరణరహితమై భోగభాగ్యములు శాశ్వితముగ పొందుటయే మానవుని సంపూర్ణత్వము-కైవల్యము.

కావుననే ఇట్లు బృహదారణ్య ఉపనిషత్తు పలుకుచున్నది.

"సామత్వం యద్వేదసమః
సాయుజ్యసలోకతాం జయతి
యఏవ మేతత్సామవేద."

వావిలికొలను వెంకటరమణరావు.




శ్రీమతి వల్లభనేని రంగాదేవి

(ఫిబ్రవరి సంచిక తరువాయి)

## ప్రథమాంకం — పంచమరంగం

(ప్రదేశం_సదాశివ సౌధం. నీలిమ పద్యం పాడుచుండును.)

హుందాగ భువిమీద బృందంబుతోనుండ
యోధుల్ జీవిత యోగ్యతెరుగు!
మాతృదేశానికై మందహాసముతోడ
మరణించువారల్ మనుజులనగ!
తెగత్రాగి మత్తెక్కి తైతక్కలాడెడు
త్రాష్ఠుతే ఈరీతిని తత్వమెరుగు?
నేడెంతో సుఖముగ సేతెంచు మనుజులు
పాడెపై రేపట పైనమగును!
రాజు ఫకీరు లెవ్వరీ రాచబాట
దప్పిపోలేదు; ముందును దప్పలేరు!
కష్టజాలము పయిబడ కడలిలాగ
చలనమెరుగని వారలే చరిత నుంద్రు!

సదాశివ్:-(ప్రవేశించి) యేమిటి సంగతి చెప్పుము రాణి?

నీలిమా:-ఇంకేముంది; మీరు రాజయ్యే వూహాకల్పనలో వున్నాను. నిన్నరాత్రి కల మీరు ఝాన్సీ సింహాసనంపై గూర్చుండి వున్నట్లూ పహరావాండ్రు నిలబడి యున్నట్లూ సదా, దాసీ పరివారం సేవానిమగ్నులై వున్నట్లూ, అబ్బో! ఆదర్జా - ఆదర్పం - ఆడాబుసరి యేంజెప్పను! శ్రీరామచంద్రమూర్తి దర్బారులాగావుంది. తర్వాత ...

సదాశివ్:-(ప్రసన్నుడై) చెప్పుము; చెప్పుము; ఆపబోకుము. తర్వాత యేం జరిగింది?

నీలిమా:-తర్వాతేముంది జరగడానికి? మెలకువొచ్చింది. కళ్లుదెరచి చూస్తిని గదా పొద్దు బారెడెక్కింది. పనిమనిషి కసవు జిమ్ముతోంది. కాలకృత్యాలు దీర్చుకోడానికి దొడ్లోకి బోయాను.

సదాశివ్:-చాలు; ఆనందమంతా అధ్వాన్నమయ్యింది. దరిద్రపు నిద్రకు కూడా అప్పుడే మెలకువ రావాలీ? ఇంకొంచెం సేపు నిద్రపోతే వచ్చిన నష్టమేంటి?

నీలిమా:-మెలకువవస్తే మెలానిద్ర పోవాలి? కల సొంతమైతే మాత్రం యేమౌతుంది. కలలో రాజవగుదువు అంతేగా! వూహాసౌధాలు నిర్మించుకునేటప్పుడు; అడుసెందులకు సిమ్మెంటుతోనే నిర్మాణం సాగనియ్యండి.

సదాశివ్:-మళ్లీ అదే యెగతాళి. నీవు నా యర్ధాంగివి. నామాటల గౌరవించు. ఝూన్సీ గద్దె సంపాయించి - నేను యేరాజుకన్ననూ తక్కువవాడను గానని రుజువు చేస్తానని నీకిదే మాటిస్తున్నాను. మొన్న నేగదూ జ్యోతిష్కుడు కూడా నా చెయ్యిజూచి, తప్పకుండా గద్దె క్కుతావన్నాడు. జ్యోతిశ్శాస్త్రమంటే అల్లాటప్పా యేంగాదు.

నీలిమా:-అయితే అడ్డగించేదెవరు? భగవంతుడనుగ్రహించి అభివృద్ధికొచ్చులాగ జూచుగాక. నాకు సంతోషమే గదండీ! మహారాజాధి రాజులు ఝూన్సీ ప్రభువులకు దండాలు. స్వీకరించ గోరెద.

సదాశివ్:-మళ్లీ అదే బాణి? నీలిమా! నేను రాజును గాజాలనా? రాజయ్యేవాడి నొష్టను ప్రొద్దు పొడుస్తుందంటావా? రెండు కాళ్లూ, రెండుచేతులూ, గల మనిషే వాడుకూడ. కాని నీకేలా విశ్వాసం గలిగించగలను?

నీలిమా:-విశ్వాసం గలిగించే విషయమే ముంది యిందులో? అడుక్కుతినే వాళ్ల క్కూడా అంగాలన్నీ వుంటై అయితే మరి వాళ్లంతా శ్రీమంతు లెందుగ్గా రాదు? తప్పకవుతారు.

సదాశివ్:-అయితే నీకు విశ్వాసం కలిగి నట్టేనా?

నీలిమా:-ఎందుక్కాదండీ? నత్తగుల్ల శంఖం కావడానికి ప్రయత్నిస్తున్నదంటే విశ్వసించ వలసిందే? కాని కొంతగాక పోయినా కొంతైనా-కొద్ది కొద్దిగా.

సదాశివ్:-కొద్దిగాయేంటి? ఆకొద్దిని గొప్ప చేసి, విను - ఇరువైవేల సైన్యాన్ని తయారుజేసి సిద్ధపరచాను. తొందర్లోనే ఝూన్సీరాజ్యంపై దండెత్తి విజయం గాంచెద. నన్నడ్డగల వాడెవడున్నా డసలు? మన రొట్టె నేతిలో బడ్డది. నేను రాజును మరినీవు రాణివి.

నవయుగంబిది చంద్రుని నవ్యకాంతి
సుఖములోనగూర్చు ప్రజలకు సులువుగాను;
గద్దెగూర్చుండు డాబుగా కలియుగాన
ప్రజలు జేజేలు గొట్టగా ప్రభువు కెపుడు!

నీలిమా:-చూస్తున్న స్వప్నం మధ్యలోనే మాసిపోయి నేనిలా అనాల్సి వస్తుందేమో!

కాగితపు నావమీదెక్కి కడలిదిగిన
రెంటికిం జెడ్డ రేవడీ, రేవుగనక!
పిచ్చిపనులేమి చేయకు పిచ్చివాడ
యెందుగాకుండ బోదువు, యేబిరాశి!

సదాశివ్:-అలాయెప్పుడూ జరగదు. సదాశివు డెప్పుడూ అంతపిచ్చిగా ప్రవర్తించడు. స్వయంగా పొలిటికల్ యేజెంటగు మేజర్ ఎలిస్ నన్నుగురించి వైస్రాయిగారికి-ఝూన్సీరాజ్యం స్వతంత్రమైన పిమ్మట పీఠి కప్పజెప్పాలని సిఫారస్ జేసాడు. ఇంక భయమెందుకే.

ఝాన్సీ రాణి చేతినుండి పాలనాధికారం పోయిందనే అనుకోయిహాను. గవర్నరు జెనరల్‌గారి గద్దింపుతో రాణీగారి సౌధం యేరాతి కారాయి పూడిపోయింది.

నీలిమా:-అయితే రాణిగారు యెదిరించి తారసిల్లదా? ఆమె కూడా పరాక్రమశాలినియగు రమణి? అంత తేలిగ్గా వుందని మాత్రం విశ్వసించను నేను.

సదాశివ్:-రాజనీతి చాతుర్యం నీకేందెల్సు లేవే? పొయ్యిదగ్గర కూర్చుండి పప్పు వండమంటే వండుతావుగాని రాజకీయాలు తెల్సా? ఆర్డరు వినగానే రాణి నిర్జీవురాలయ్యేను. కరెంటులాగా కదిలింది; యుద్ధానికి సన్నద్ధమైనట్టుగా శంఖం పూదించింది. కాని దివాన్ మీర్‌చంద్ - రాణిగారి కోపమంతా కరగిపోయేలాగా మంత్రోపదేశం చేసాడు. కోటఖాళీ జేయించాడు. సైన్యాలకు సెలవులిచ్చి - రాణీగారు పూజా పునస్కారాలు జేసుకోసాగింది. రాయబారాలు - వుత్తర ప్రత్యుత్తరాలు జరుపుదామంటాడు దివాన్ మీర్‌చంద్. వుత్తర ప్రత్యుత్తరాలతో యేమవుతుంది బూడిద. అదంతా ఒకనాటకం?

నీలిమా:-అయితే దివాన్, ఆంగ్లేయులతో మరీకయ్యాడంటారా?

సదాశివ్:-కాకుంటే నీతో పరీకయ్యాడనుకుంటున్నావా? ఆనాటి సంప్రదింపుల్లో మేమిద్దరమూ వున్నాంగా? కుబేరులను చేస్తానన్నాడు మేజర్ ఎలిస్. ఇంకా చింతేముంది?

నీలిమా:-మీకేదో దయ్యం బట్టిందనుకుంటా. వర్తకం జేసుకోవడానికొచ్చిన వీళ్లు రాజులయ్యారు - మిమ్మల్ని మహారాజును జేస్తారు? మీకేం పిచ్చెత్తలేదు గదా - వీళ్లనెలా నమ్ముతున్నారండీ? అసలు ఝాన్సీరాణి మీకేమపకారం జేసింది?

సదాశివ్:-అదంతా అనవసరం. ఆంగ్లేయులు అనుకున్నది చేయగలరు. రాజును ఫకీరుగాను - ఫకీరును రాజుగానూ చేయగలరు. నామీద వాళ్ల దయాదృష్టి పడ్డది. యేమనుకుంటున్నారో మరి?

నీలిమా:-కాని తెలివిగలవాడు కల్పిత సౌధాలు కట్టడం మాని దేశసేవ జేస్తే చెడిపోతాడా? మీబోటి తెలివిగలవాళ్లవల్ల వాళ్ల పనులు సమకూడిననాడు తోటకూరలో పురుగును తీసి పారేసినట్టు పారేస్తారు మిమ్ము; అసలది దెల్సుకున్నారా?

సదాశివ్:-అయితే యేంజేయమంటావు? అయిదూళ్లిస్తే యుద్ధం గిద్ధం అల్లరి గిల్లరి యేముండదంటిని. అందుకు రాణిగారు అంగీకరించదాయె. మరింకేంజేసేది

నాతప్పేముంది? ఆంగ్లేయులు కూడా యివ్వరంటావు, తడాఖా జూపిస్తా, యెదుర్కొంటా. యెంతగాదన్నా బ్రాహ్మణ్ణి. "బ్రహ్మస్థాన్" సాధించి తీరుతాను.

నీలిమా:-ముందు ఝాన్సీ రాజ్య రక్షణలో రాణికి పూర్తిగా తోడ్పడు. ఆపిమ్మట "బ్రాహ్మస్థాన్" తీసుకో.

సదాశివ్:-ఊఁహూ - అదొల్లదు. ముందు బ్రహ్మస్థాన్ తర్వాత ఝాన్సీ - అంతే. చెప్తున్నాగా పోరాడైనా సాధించేదే.

నీలిమా:-మరి సాధించలేకపోతే?

సదాశివ్:-తెల్లోళ్ల మద్దత్తుతో సాధిస్తాను. నీకు దెలవదుగాని భారతదేశానికి బయట కూడా చాలామంది బ్రాహ్మణులున్నారు. వారి మద్దత్తుతో సాధిస్తా. బ్రహ్మస్థాన్ సాధించకుండా శ్వాసబిల్చననుకోయిహాను. యిదీ ప్రతిజ్ఞ!

నీలిమా:-కలగంటున్నారా? లేక గాలి మేడలు కడుతున్నారా?

సదాశివ్:-గాలి మేడలుగావు. ఝాన్సీ రాజ్యం మనవాళ్లనుంచే రాణీకి హస్తగతమయ్యింది. దీనికి ప్రామాణిక చరిత్ర చాలా వుందిలే. అంతరాజ్యంలో నాకు అయిదూళ్లివ్వడానికే అంత కష్టమైతే ఇదంతా ఆగ్లేయుల హస్తగతమైతే మాత్రం నాకేమంటా. అవ్వాలంటాను కూడా. మిష్టర్ ఎలిస్‌గారి కృపనాపై బడాలిగాని చెప్పేవన్నీ చేసిచూపించనూ? తెల్లోళ్ల తరఫున తగూకు బయలుదేరతాను - రాణీగారు పోరు ప్రారంభిస్తేను.

నీలిమా:-అంటే.. మీరుకూడా మీర్జాఫర్ లౌతారన్న మాట? అంతేనా?

సదాశివ్:-అయితే అందులో ఆఘాయిత్యమేముంది? రాజుగావడానికి పాప మొక లెఖ్ఖా-?

నీలిమా:_ఓహో - ప్రభావమింతవరకు ప్రాకిందన్నమాట. దొంగ బేరగాండ్రదయ్యం ఆసించి పలికిస్తోందనుకుంటాను. మీరుచూచే బ్రహ్మస్థాన్ మీవంశీకులకెవ్వరికీ కానరాలేదేం? మీరే గనుక మీర్జాఫర్ లైతే చీపుర దీసుకోనే? పదండి ముందులోనికి.

సదాశివ్:-అరే...నీవనేదేమిటే?

నీలిమా:-పదండి...చన్నీళ్లతో తలారా స్నానం చెయ్యండి-లేకుంటే బ్రహ్మస్థాన్ స్మరణతో పిచ్చెత్తేలాగుంది. ఒకటే స్మరణైపోయింది బ్రహ్మస్థాన్ స్మరణ. పదండి.

(సదాశివ్‌ను తీసుకుని పోవును)

(సశేషము)

# జయమతి

## ('నాథూరామ్‌ప్రేమి' యొక్క కథకు యనువాదము)

అస్సాము దేశచరిత్రయందొక యుజ్జ్వలాదర్శమగు స్త్రీ చరిత్ర యున్నది. పదునేడవ శతాబ్ది యందు శివసాగరజిల్లాకు రాణి జయమతీదేవి. ఆమె యొక్క సహిష్ణుత, పాతివ్రత్యముల వలన లోకమందసమాన ఖ్యాతి గడించెను. ఆమె యపూర్వ కథలు, పురాణస్త్రీలైన సీతా, దమయంతుల పతిప్రేమను గుర్తుకు తెచ్చును.

క్రీ॥ శ॥ 1679 సంవత్సరమున "చాంగురీయా" వంశమున "చులికఫా" యను రాజు "ఆహోమ్" రాజ్యసింహాసనము నెక్కెను. ఆరాజు పిన్నవాడును, అల్పశరీరుడును యగుటచేత ప్రజలీతని "లరా" రాజని పిల్చుచుండెడివారు. అస్సామీ భాషలో "లరా" యనగా బాలకుడు, లేక శిశువని అర్థము. వయస్సులో చిన్నవాడైనను "లరా" రాజు బుద్ధిమంతుడాయెను. అప్పటి రాజ్య దశననుసరించి, మంత్రుల శక్తిననుసరించి లరారాజు యమాత్యుల సంప్రదింపుతో తత్సింహాసన మెక్కుట కర్హుడగు ప్రతిరాజకుమారుని యంగహీనునిగానో, ప్రాణహీనునిగానో జేయ నిశ్చయించెను. లరారాజు యొక్క దుష్కార్యము ప్రారంభమాయెను. అనేక వంశములయొక్క యనేక రాజులను వికలాంగులుగను, విగతప్రాణులుగను చేసెను. భీరుత్వము, కాపురుషత, అత్యాచారము లందాసక్తి యనునవి దుర్బలరాజుకు స్వభావములు. లరారాజు స్వతః దుర్బలుడగుటచేత యీప్రకారము కాపురుషతకు, క్రూరతకు స్థానమై రాజ్యభోగముల ననుభవించుచుండెను.

తుంగఖుంగీయ వంశీయుడగు గోవరరాజు పుత్రుడయిన గదాపాణి యోజస్సంపన్నుడై లరారాజు హృదయమున భీతి కల్పించెను. గదాపాణి యొకే దినమున మూడు మత్తగజముల దంతముల చేబట్టి కదలకుండ చేయగల శక్తిగలవాడు. ఇద్దరు ముగ్గురు రహస్యఘాతకుల ద్వారా యీ పురుషసింహుని వికలాంగుని చేయుట యసంభవమని యెంచి లరారాజు వానిని వధించుటకై పెద్దపన్నాగము పన్నెను. ఎటులనో యీ కుట్ర గదాపాణికి తెలిసెను. కాని వాని హృదయ మిసుమంతేని చలించలేదు. గదాపాణి యొక్క రాణి జయమతీదేవి సచ్చరిత్రగల, పతివ్రతా తిలకము. ఆమె స్త్రీసులభ స్వభావముచే పతిరక్షణార్థమై మనోవ్యాకులత జెంది వాని నెక్కడికైన పారిపొమ్మని వేడుకొనెను. గదాపాణి మాత్రము దానికి సమ్మతించలేదు. అతడు "నేను మృత్యువుకు జడియు వాడను కాను. నిన్ను, పసిపిల్లలను వదలి యిచ్చటినుండెప్పుడును పారిపోను" అనెను. జయమతి భయకంపితయై "నాథా! మీ వీరహృదయము మృత్యుభయముచే కంపించదనియు, మీరు మృత్యుభయము తుచ్ఛమని తలతురనియు నేను బాగుగా నెఱుగుదును. కాని, అలోచించండి, మిమ్మురాజ సేవకులు బంధించి, వధించిన పిమ్మట మాగతి ఏమగును? మీజీవాత్మ నిర్యాణము జెందిన పిమ్మట మీదాసి ఒకగంటయైన యుండజాలదు; మఱియు, యీ కండ్లుతెరువని బాలకుల యవస్థ ఏమి? కావున నాప్రార్థన నంగీకరించి మీరీపాపరాజ్యమును కొంతకాలము వదలి రహస్యముగ యుండుడు. మఱల శుభదినములు వచ్చిన యెడల, జగదీశ్వరానుగ్రహముచే భాగ్యచక్రము పరివర్తనము చెందినచో మీరు తిరిగి వచ్చెదరుగాక! మీ జీవితమమూల్యము. తద్రక్షణార్థమై ఏదైన యుపాయము యోజింపవలయును." అనెను నిదాన స్వభావుడైన గదాపాణి పత్నియొక్క ఆతురతచే పరాజితుడై గుప్తవేషమున నాగపర్వతము వైపు పారిపోయెను.

లరారాజు గదాపాణిని బంధించుటకై పెద్దసేనను పంపెను. సేన తిరిగివచ్చి గదాపాణి పలాయనమును లరారాజుకు తెలియపరచెను. కాపురుషుడైన లరారాజు వైరిపత్తా తెలియనందున వ్యాకులత జెందెను.

ఆతడు జయమతినుండి గదాపాణి జాడ తెలియుటకై దూతనంపెను; గాని, యామె భర్తను గురించి ఏమియు చెప్పలేదు. ఈవిషయము దూతముఖమున విని లరారాజు క్రుద్ధుడై జయమతిని ఖైదీగా తెమ్మని యాజ్ఞాపించెను. సేవకుడు రాజాజ్ఞను పాలించెను. లరారాజు, జయమతితో, "నీపతి యెచ్చట దాగినాడో చెప్పుము. లేనియెడల చిత్రవధ జేసి యమలోకమార్గము జూపెద" ననెను. జయమతి నిర్భయముగ యిట్లు సమాధాన మిచ్చెను:-

"నేను భర్తజాడ తెలుపనని దూత ద్వారా యింతకుముందు జెప్పినను నన్ను మఱల, మఱల ఏల ప్రశ్నించెదరు? నా ప్రతిజ్ఞ యచంచలమైనది. మీరు నాశరీరము నెన్నైన యత్యాచారములచే బాధించ గలరు గాని, నా మనస్సుపై నాకే పూర్ణాధికారమున్నది. నా పతిజాడ తెలియు నాశ వలదు." కోపోద్రేకమున లరారాజు జయమతిని రాజద్వారమెదుట యవిరామముగా బెత్తములతో కొట్టింప యానతిచ్చెను.

మూఢుడైనరాజు తన దుర్బల పశు హృదయము నాదర్శముగా నెంచి సంసార మందందరిని యట్లే దలచెను. జయమతి బెత్తముదెబ్బలకు భయపడి పతిజాడ చెప్పునని వానియూహ. దినములు గడచినవి. కాని జయమతి నుండి యభీప్సిత వాక్యము రాదాయె. ఆమె బాధనవలోకించుచు ప్రజానీకము నిస్తబ్ధత జెందెను. ఆసమయమున శక్తిశాలియగు పురుషుని లేమి దేశమున గన్పట్టుచుండెను.

కాలక్రమేణ నాగగిరిపై యున్న గదాపాణి తన భార్య యత్యాచారములకు గుఱియైనట్లు వినెను. అంతట నాతడు లరారాజు పాపపురికి జని నిజరూపములో జయమతి వద్దకేగి "రాజకుమారీ! నీవు వ్యర్థముగా కష్టముల పాలగుచున్నావు. స్వామిజాడ తెలియజేసి యాతననుండి విముక్తి నొందు" మని జెప్పెను. ఆమె బాధాతీవ్రతచే క్రుంగిపోవుచు, భగవత్స్మరణచేత భర్తృ చరణస్మరణచేత కాలము గడుపుచుండెను. అందువలన పతిని జూడలేదు. రెండవసారి భర్తజెప్పినప్పుడు ఆమె భర్తను గుర్తించెను. ఎవనికై యనంత కష్టమును సహించెనో వాడే కట్టెదుట పట్టుబడిన తన శ్రమయంతయు నిష్ఫలమే గదా యను సంకోచమామెను బాధించెను. ఆమె "పతియగు స్త్రీ తన స్వామికై దేనినైనను సహించ గలదు. స్వామి కల్యాణార్థము ప్రాణదానముజేయుట సతీకర్తవ్యమై యున్నదని" అతిశయ కాతరదృష్టితో యన, నాతడు నిమిత్తరుడై వెడలి పోయెను. ఆమె దైనందిన బాధయందు మార్పురాలేదు.

గదాపాణి వెళ్లిన తరువాత పదునాలుగు, పది పదునైదు దినములు హింస జరిగెను. ఇట్లు దుస్సహ క్రూరత్వ పీడితయై యా సాధ్వీమణి శరీర యాత్ర జాలించెను. ఆమెచరిత్ర సహిష్ణుతకు, పాతివ్రత్యమునకు జాజ్వల్యమానమగు తార్కాణముగ యంకితమైనది.

స్వపత్ని స్వర్గారోహణమును విని గదాపాణి యస్వస్థుడై మహారాజుపై పగతీర్చుకొనుట కాయత్తచిత్తుడాయెను. ఒకబలతరమైన సైన్యము ప్రోగుజేసి వైరిని రాజ్యచ్యుతునిజేసి తత్సింహాసనమును నాక్రమించెను.

గదాపాణి గదాధరసింహుడను నామాంతరము నొంది క్రీ॥ శ॥ 1681 నుండి 1695 వరకు రాజ్యము పాలించెను. ఆతని మరణాంతరము వాని పుత్రుడైన రుద్రసింహుడు సింహాసనమున సుశోభితుడాయెను, తన తల్లి కీర్తి చిరస్మరణీయము చేయుటకై యామె యెడల యత్యాచారములు జరుపబడిన చోట "జయసాగర" మను విస్తర సరస్సును త్రవ్వించి, తత్సమీపముననే "జయదోల" మను దేవమందిరము నిర్మించెను. ఇప్పటికిని శివసాగర జిల్లాలో జయసాగర సరోవర నిర్మలోదకములు పవనప్రేరితములై జయమతీ కీర్తిని పాడుచున్నవి. జయదోల దేవమందిర ఘంటారావము జయమతీదేవి సచ్చరిత్రమునే యుద్ఘోషించుచున్నది.

మైలవరపు వేంకటేశ్వరశర్మ, బి. ఎ.






## సెనగపిండి ఉండలపులుసు

¼ సేరు సెనగపిండి, 1/8 సేరు నీరుల్లి, కొద్దిగా అల్లం, పది, పన్నెండు పచ్చిమిరపకాయలు, 1/8 సేరు టొమాటోలు, ఒక చెంచా పసుపు, అరచెంచా కారప్పొడి.

ముట్ట మొదట, పావుసేరు సెనగపిండి, అరచెంచా కారం, పిండికి తగినంత ఉప్పు, కొద్దిగా నీళ్లు పోసి రొట్టెలకు పిండి కలుపుకున్నట్లు కలుపుకోవాలి, తరువాత దాన్ని చిన్న చిన్న ఉండలుగా చేసుకుని సేరుసేరున్నర నీళ్లలో ఉడకపెట్టాలి. ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు, అల్లం, వేరేసన్నగా తరుక్కుని ఒక పెద్దపాత్రలో, 2 తులాలు నెయ్యిపోసి బాగా కాగుతున్నప్పుడు వీటిని వేయించాలి. తరువాత వీటిలో ఒకచెంచా పసుపు, అరచెంచా కారపొడివేసి, ఒకసారి గరిటతో కలిపి చిన్న చిన్న టొమాటో ముక్కలువెయ్యాలి. టొమాటోలు బాగా ఉడికిన తరువాత, మొదట ఉడికించి పెట్టుకున్న సెనగపిండి, అందులో నీళ్లూవేసి, తగినంత ఉప్పుతోకూడా ఉడికించాలి. ఇది మజ్జిగపులుసంత చిక్కబడగానే కొద్దిగా పచ్చికొత్తిమిరిఆకు సన్నగా తరిగి, దీనిలోకలిపి, దించిన మంచివాసనతో నుండును. టొమాటోలకు బదులు పుల్లమజ్జిగవేసిన చాలా రుచికరముగా నుండును.

## ఆనపకాయ కూర

అరవీసె ఆనపకాయిలు, అరపావు టొమాటోలు, అరపావు నీరుల్లి, గచ్చకాయంత అల్లం, పది పన్నెండు పచ్చిమిరపకాయలు, అర చెంచా పచ్చిధనియాలపొడి, ఒకచెంచా పసుపు, అరచెంచా కారపొడి, కొంచెం కొత్తిమిరి.

లేత ఆనపకాయ, టొమాటోలు, వేరు వేరుగా చిన్నముక్కలుగా తరుక్కోవాలి. ఉల్లిపాయలు, అల్లం, పచ్చిమిరపకాయలు, కొత్తిమిరి సన్నగా తరుక్కుని అరపావు నేతిలో వేయించాలి. వీనిలో ధనియాలపొడి, పసుపుపొడి, కారపుపొడివేసి గరిటతోకలిపి మాడిపోకుండా కొత్తిమిరి, టొమాటోముక్కలు వేసి త్వరగా వేయించాలి. టొమాటోలు ఉడికిన తరువాత, ఆనపకాయ ముక్కలువేసి, అయిదునిముషాలు వేయించి, అరసేరు నీళ్లుపోసి మూతపెట్టి ఉడికించవలెను. ముక్కలు ఉడికిన తరువాత కొత్తిమిరిఆకు కొద్దిగావేసి దించిన కూర తయారవును. కొత్తిమిరిఆకు వేయకపోయినా ఫరవాలేదు. ఈ కూర నీళ్లగానే ఉంటుంది. ఇది అన్నంలోకయినా రొట్టెకయినా రుచిగా ఉంటుంది. కూరలో ఎక్కువ నీళ్లులేకుండా ఉండాలనుకుంటే, ఆనపకాయి ఉడుకుటకు కావలసినంత నీళ్లుమటుకే పోసి ఉడికించుతే సరిపోతుంది.

కానుకొల్లు వనజ

# స్వర్ణకంకణ ప్రదాన ప్రశంస

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

నెలకొనె నేడు కేసరి మనీషి హృదంతరసీమ నాంధ్రభూ
తలపతి కృష్ణరాయతయు, తంజపురాధిపమౌళి - సాహితీ
విలసిత చక్రవర్తి - సుకవిత్వరహస్య కళావిశారదుం
డలరఘు నాథరాయత - మహోళియు రామవిభుత్వతాదులున్,

ఇది పురంధ్రీజనమ్ములు హృత్కవాట...
ముల్ దెరచి పాడి హారతుల్ బూనువేళ
ఇది తెనుఁగుతల్లి గర్వించి ముదముమీర
ఱొమ్ము విరువంగ యశముమార్మ్రోగువేళ

గరిమె నమృతమ్ము జిలికించు కాంతలవుర!
కలము గొని కైతలల్లంగ గడగినారు
కనక కంకణ కింకిణీ ధ్వనులు చెలఁగ
నెందరెందరో గృహలక్ష్మి బంధులగుచు.

భువన విజయాఖ్య రసమయ భవనసీమ
విందు నందిన నూపురానంద మృదుల
మధుర నినదమ్ము నేటికి మరల నెగడె
నాంధ్ర గృహలక్ష్మి మందిరాభ్యంతరమున.

నీరసము శాకపాకమ్ము సారసమ్ము
చేసి లసదలంకార విశేషవితతి
వెలసె సుకవి కుమారికా కులము నేఁడు
మూఁడు భవనాలు - కాలాలు మోకరింప.

కేసరి స్వర్ణకంకణము కేలధరించితి-పట్టరాని సం
తోసము మీర నేటికి-ననూనకృపామతి శ్రీరమా మనో
ల్లాసుడు నమ్మహామహు నిరంతరమేలునుగాత! వేడ్కని
ట్లే సుకవీంద్రపాళి నలరింపగ వత్సర వత్సరమ్మిటన్.

అద్యతనాంధ్రయుగము

## శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

"శ్రీమదోంకార పంజరా సీనశుకము। ప్రాంచదుపనిషదుద్యాన పరభృతమ్ము
ఆగమారణ్యవీధీ మహామయూర। మైన కాత్యాయనీదేవినాత్మఁదల" చుటచే

అమృతరస భాండారమైన మానసతరంగిణినుండి యుద్బుద్ధమైన తలపు విరిదమ్మినుండి తొరంగిన తీయనితేనె వాఁకలే సోదరి రుక్మిణమ్మగారి కృతీసౌభాగ్యములు.

పాలివోని జీవరత్నములై ఆంధ్రుల యదృష్టరేఖలై అమృతరస ప్రవాహములై పొలుపు మిగిలిన కృతరత్నముల వెలయింప జేసిన యీకుంకుమ శోభిత సుద్వాహమాడినవారు శ్రీ స్థానాపతి సత్యనారాయణశాస్త్రిగారు. వారును కవితల్లజులే. అగుట యీ జంట కవిచకోర మిధునమైనది. ఇది పర్వేశ్వరుని ఉత్కృష్ట లీలా గాథలయందొకటి. ఇతల్ల పూర్వమే పదిం బదిగా శ్రుతపూర్వమైన యీమె జననాదికములో పొనల్ల పున్యమును ఘటింపక ప్రస్తుతమును ప్రసంగింతును.

ఈమె బాల్యమునసేమోకాని యౌవతమున మెట్టినిలుసొచ్చి పలుకు పసదన మెఱిగి కమ్మనౌ కావ్య వితానములగ్రుచ్చి విరిమాలలుగ పరమేశ్వరి నలంకరించు పతిదేవునికడ నిటు సాహిత్యశిక్షణమును, నటు సంసార శిక్షణమును సాగించెడువారు. ఒక మలువాని హెచ్చుగ సాహిత్య శిక్షణకే కాలము వెచ్చించిరేమో యన్నను పరామరికలేని పలుకే కావలయును.

శ్రీ స్థానాపతిగారు తన సాహిత్యగురువులని మాసోదరి తన జీవనస్వామిపైగల గౌరవము పాయ లేక యూది యూది పలుమరు పలికి పలవరించుటేకాని నిజమునకు వెలలేని తులలేని కావ్యరత్నముల హృదయకోశమునుండి వెలువరించి రసలుబ్ధులగు ఆంధ్రులప్రోల పలుకు పలుకునకు బేహారము పఱపి విలుచుకొన్న యశోధనమును ప్రాణములనించి కుటుంబగౌరవము పెంచిన ప్రతిష్ఠ మా సోదరిదే.

నిడుదలై, విరిసిన విరిదమ్మిరేకులబోలె వెడదలై చూపు చూపున మధుర తేజముగురియు కన్నుదోయితో వాగ్దేవి పదమంజీర మంజులతర శ్రావ్యరవళిని దలపునకు దెచ్చులేఖే నీవిన్యాసభంగిమలు నర్తించు కంకణ నిక్వాణముతోడి కరయుగముతో, నిగనిగమను మేనిచాయతో, గరగరనే మాంగల్య రేఖతో తొలి పలకరింపుననే 'చెల్లీ' యని మనసిచ్చి మాటమచ్చికనెఱపు మంచితనము సోదరి రుక్మిణమ్మకే చెల్లినది.

అందాలుచిందు చెంగామలతంపరవంటి వారి కావ్యవీథులలో నొక్కింత ప్రొద్దుపుత్తము.

పూలమాల, దేవుడు. ఖండకావ్యాలు వత్సరాజు, దూతఘటోత్కచము (నాటకము) ప్రార్థన, దయ్యాలు, ఊర్మిళ. (పాట) కాదంబిని (ఖండకృతుల సంపుటి) చారుదత్త (నాటకము) దేవీభాగవతము (బృహత్పురాణము - వచనము సంస్కృతానువాదము) ఇవి వీరిముద్రిత గ్రంథములు. యుక్తిమాల, నీలాటిరేవు, సప్తశతి అనునవి వీరి యింకను నముద్రితములు.

ఇందు దూతఘటోత్కచము, వత్సరాజు, చారుదత్త అనునవి భాసకావ్య శ్రవణమున పూరించు కొన్న రసభావములతోకూడిన హృదయమునుండి పొంగి తయారైన దృశ్యకావ్యపాకములు. సప్తసతి అనునది అపుడపుడు వ్రాసిన యేడునూర్లు పద్యముల సంపుటి. వీనిని ప్రాసంగికములనవచ్చును. కడపటు కొన్ని కావ్యములు, కొన్ని కథానికములు, కొన్నినవలలు; దేవుడు, ప్రార్థన, యనునవి వివిధోప నిషత్తుల నుండి యేర్చి కూర్చిన దైవత్వ ప్రతిపాదకసూక్తి సమన్విత వ్యాఖ్యానములు.

నాదృష్టికి ఈరచనములన్నియు నొకయెత్తు వారి దేవీభాగవత మొకయెత్తు. అదియొక విపులగాథా సంకలితమగు బృహత్పురాణము. దీనిని తెనిగించి సాటిస్త్రీదరి లోకమున కెనలేని ఉపకృతిసల్పిన రుక్మిణమ్మగారు నిజముగ నిట్టియనేక నూనగౌరవార్హతలకు దగిన యోగ్యురాలే యనవలయుగాక.

ఇకవాఙ్మయ విమర్శనా ప్రస్తావము చేయబోవుదము:

శ్రీవీరేశలింగ మహీతుని కాలమునుండి యేపుజెందుచు వచ్చిన ఆధునికి ఆంధ్రవాఙ్మయ రసాలము శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మున్నగు రస సిద్ధుల భావామృతసేచనముచే బలుపుజెంది మధురమాకందముల నందించినది.

ఇదివాఙ్మయక్షేత్రమున ఒకపరిణామ ప్రవాహము. ఇందుతోడి కవిలోకముపరవశమై పూర్తిగా మునిగి తేలగా కవయిత్రీలోకము, ఒడ్డున నిలువబడి మనమును మునకలు వేయుదమా మానుదమా యని ఆలోచించి కడకు మునుగకయే పాదప్రక్షాళనముతోడను, శిరస్సంప్రోక్షణముతోడను మాత్రమే తనివి చెందిన దనవచ్చును.

ఈయద్యతనాంధ్ర సారస్వతరంగమున నభిషిక్తయైన రసజగద్రాజ్ఞి యీ మాసోదరియే.

పూవుపుట్టగనే పరిమళించునట్లు వీరితొలికబ్బముగు పూలమాల యందలి చందమామను తొలిదర్శన మునసే యెట్లురూపించిరో; వీరు! చూడుడు;

"మల్లెపూదోట తిరుగాడు మాలివోలె చల్లగానెటు పోదువో చందమామ!"

ఉత్తమ కావ్యలక్షణమగు ధ్వన్యాత్మకమగు ఈవాక్యమే యొక కావ్యమననగును.

"కవిత, గుమ్మడు, కుంతీసందేశము, కృష్ణునితో పాంచాలి, సుమన, శాండిలి." యను అనేక మకుటముల క్రింద నీవరవర్ణిని సుధ్యానిష్యంది లేఖినితో పూలమాల కూర్చినది.

'గుమ్మడు' అనుకావ్యమున "వెలలేని రతనాల నమరారు బహువిధ రత్నకంకణమ్ము"లు ఘల్లు ఘల్లురన ఘుమ్మ ఘుమ్మని పెరుగుతఱచు యశోదమ్మలో రూపొందిన స్త్రీత్వమును మనకు ప్రత్యక్షము జేయుచు "సుప్రభాతే స్వయంసా నిర్మమంథ వ్రజరాణీదధిం నందపత్నీ" అని యుల్లేఖించిన భాగవత కారుని వచనములకు జీవముపోసినారు. అంతేకాదు స్త్రీత్వ గృహి ధర్మపరిపాలనా గౌరవమును గూర్చి నేటి నాగరికయావతమునకు హెచ్చరికలు దెల్పినారు.

'కవి' యను కృతియందు కవి నిరంకుశతావిహారమును సర్వతంత్ర స్వతంత్రతను అప్రతిమాన ప్రతిభతో ఒకచక్కి ప్రశంసించుచున్నే,

"అన్యదేశాల సంచారమన్యదాస్య! మొక్కభార్యకు నేవురు నొప్పుమీర
భర్తలై పాండవులు కీర్తిప్రబలియుంట! వ్యాసకవి సార్వభౌము నిర్వ్యాజకరుణ!"

యను పద్యమున వ్యాసకవి సార్వభౌముని కలము పోటుచే స్త్రీజాతికి అశాశ్వతముకల్గిన మాయని యీ యవమతికి కలంగినమదితో పరమాభిమానినియై కవయిత్రియైన దానును ప్రతీకారముగ వ్యాసునికొక్క కలముపోటును చురుక్కున దగిలించి మఱియట్టె విడుచుటయే కాక, స్త్రీహృదయమును, అందలి మూగవోయిన యావేదనను ప్రస్ఫుటీకరించి, స్త్రీజాతికృతజ్ఞతకు పాత్రురాలైనారు.

"నిబిడనిద్రాభి ముద్రితమైన యట్టి! మహిత హేమంత శర్వరీ మధ్యజగతి" ని

జ్యోత్స్నవిహాయసము నరయుచు పసిడిజిలుగు రతనాల పాత్రనిండ మధురద్రాక్షాసవమ్ము తనివి దీరగద్రావి ...

"ప్రణయరహస్య గీతాల వలపు
తేటవెన్నెల జీవంపుబాట నిలిచి
చలువ తెమ్మెల కెరటాల గళముకలిపి

...భువనాలు పల్లవింప...శరీరాలుమఱచి యేకమై పాడుకొనుచు రసజగతిని మధురకవితా పరిమళ మార్గ నిత్యయాత్రికులై అనంతపథమున సాగిపోవు ప్రణయి యుగళమును మనమ్రోల సాక్షాత్కరింపజేసి పతితల మనస్సుల నొక్కమారు చలింపజేసి, ఊరించి, ఆనందరసమగ్నముచేసి ఆలోచనాధీనముచేసి విడిచినారు.

ఇపుడిపుడే క్రొత్తగా ప్రచురణమందిన 'కాదంబిని' యందు వీరు కుమార్గవర్తనులై పతిప్రాణలగు పల్లవాధరలను బాధించు కూళలను "ఓయి మధువ్రతా నిలువుమోయి" అనునదలింపుతో నదుపునకు తేజూచిన యీ కవిరాజ్ఞి పదగౌరవమును, పలుకుబడిని గమనింపుడు.

"ఓయిమధువ్రతా నిలువుమోయి, నిశీథపువేళకూర్మితో
ప్రాయపు నాతిముగ్ధ హృదయాసవమంతయుగ్రోలి స్మృతి
చ్ఛాయమునిండి యీయెడతుపార తిరస్కరిణీ నిబద్ధమీ
తోయజమంచు దుర్వ్యథలద్రోసి కనుంగొనవేలా సుంతయున్."

అంతేకాదు ప్రోషిత భర్తృకలకు సాంత్వనముకూడ వెంటనే పచరించినారు.

"సారశిలీష బంధుర విశాలరసాల కదంబ, కుంద, మం
దార సుమాంతరాళముల దైవవశాన మధువ్రతమ్ము సం
చారమొనర్చి నీదయిన సాంద్రపరీమళ నూత్నసద్గుణాం
కూరములే తలంచుజుమి కొందలమేల సరోజరాజమా"

రసోదంచిత పదాంచితమైన పదబంధమున నవనాగరకుల వినింద్యజీవిత మార్గమెట్లు ధ్వనివ్యంజకముగ నిరూపమొనర్చిరో గమనించితిరిగదా!

ఇచట "సరోజరాజమా" యనుటకంటె "సరోజ భామినీ" అని యన్నచో ఇంకను బాగుండెడిది.

"అమృతబిందు" అను మకుటమున నీయమ ఆధ్యాత్మికోపదేష్టగా మనపరిచయము పొందుచున్నారు.

"రంగురంగుల వెలయు గోరాజి ; కాని। వాని పాలరంగొక్కటై పరగుచుండు
జ్ఞానమాపాలరీతిగా గనుపించు। లింకసకలమ్ము నావుల రీతిఁదోచు"

నని వీరు వ్రాసినట్లు ఉద్దిష్టవస్తువు ఆధ్యాత్మికమైనను, వీరమైనను, శృంగారమైనను కవయిత్రి లేఖినిమాత్ర మెపుడును అమృతమునే కురియుచుండును.

"చారు సుకర్ణకల్పిత విశాలవినూత్న మంజరీ ...
పూరితపంజరీ కృతకపోల విరాజిత గోపికామనో
హారునిఁగాంచి ... తరళాంబుజలోచన తప్తబాష్పవార్ధ
పూరమునించు కన్గొనల భూరివిషాద విఘూర్ణితాత్మయైన"

రాధవిరహమిట్లు సుదీర్ఘ సంస్కృత సమాసములతోబాటు తెగసాఁగి నిష్ఠురమైనది.
చారుదత్తములోని శకారుని యీయభిభాషణ మందలి యౌచిత్యము నారయుడు:—

"మనము వెనువెంట తగులంగ జనెడు నదిగో
కుక్కలుతఱుమ జనుయాడు నక్కవలెను
చక్కిలమువోలె నామది స్రుక్కఁజేసి"

రాధవిరహమును వర్ణించుటలో తెగబారెడు సమాసములతో నిష్ఠురమైన యీమె లేఖిని అతిసరళమగు వ్యవహారశైలిని సహితము సృష్టింపగలదు:—

పరికింపుడు : 'సతసయి' (సప్తశతి) యందలి ఒకానొక దంపతుల సంభాషమెంత సహజముగను సరళముగను ఉన్నదో:—

"నగలు ధరియింపగా నేడు నాదుమనసు। మోజుపడ్డదితీర్తురా ? మోజునాథ
సారసాహ్లాద కరుడదే చందమామ। గాంచుసుందరీ వానికిగలవె నగలు"

"కూరగాయలగొననేగి కోవిదుండు। చారుపద్మమ్ము నూతనచంపకమ్ము
వికసితేందీవరమ్ములు విద్రుమమ్ము। మంచియూపిల్లు కరికించి మరులుకొనియె"

అని వీరు 'సతసయి'లో నొకచో వ్రాసిన యీ పద్యము చూడగానే నాకు జయదేవుని గీతగోవిందమందలి,

"విక్రేతుకామాకిల గోపకన్యా। ... మాధవార్పిత చిత్తవృత్తిః
దధ్యాధికం మోహివశాదవోచత్ । గోవిందదామోదర మాధవేతి"

అనునీ శ్లోకమును గుర్తునకు దెచ్చినది. జయదేవుని శ్లోకమువలెనిది దీటువచ్చుననుచెప్పుటకీ యుల్లేఖము పొందలిడ్డలేదుకాని సామాన్య సామాజిక పరిస్థితులతోనిట్టివి సంభవమని శ్రీమతి రుక్మిణమ్మగారు రూపించిరికదాయను భావవిభ్రమము ఒక్కక్షణముపాటు నాహృదయమున తావుగొన్నది.

వీరి నాటకములన్నియు భాసకృతుల కనువాదము లంటిమి కదా! ఐనను భావప్రదర్శనముపట్ల సంఘటనమును సొంతమనిపించిన వీరిరచనా ప్రాగల్భ్యమును, భావోత్కర్షమును చక్కగా పరామర్శింపుడు:—

దూత ఘటోత్కచమున దురమున బాలుని అభిమన్యుని వధించిన సందర్భమున ధృతరాష్ట్రు దుర్యోధనుల సంభాషణచాతురి:—

ధృతరా:—"కరుణాశూన్యులనేకులు। పరిగొనియేకాకియైన బాలుని దునుమన్
దరిసద్దురాత్ములు కర! చరణంబులు గూలియేల చావనోలేదో"

దుర్యో:—"ముసలిభీష్ముని మిషజేసి యుసురుగొన్న। వారిబాహువుల్ పడలేదు, బాలుడయ్యు
ఘోరసంగ్రామ కేళీవిహారుడతని। యుసురుదీయంగ మాచేతిలూడిపడునె"

కుక్క కాటుకు చెప్పుదెబ్బయనునట్లు మానవ సహజ స్వభావమును యథారూపముగ చిత్రించిన యీపద్యము చిన్నదయ్యును, మూర్తిని చిన్నదై కీర్తిని పెద్దదైన మా రుక్మిణమ్మగారివలె ఊర్జితమైనపద విన్యాసముతో, ఉల్లముల్లూత లూగించినది. ఇట్లే యీ కావ్యమాసాంత మింపుగూర్చినది.

రాయబారము విఫలమైనప్పటి ఘటోత్కచుని కోపము:—

"ఎవరు యమమందిరమ్మున కేగదలచి। యుండిరో వారలిక వేగ లెండులెండు
పండ్లుకొఱుకుచు బిఱ్ఱబిగిబట్టి కూరు। చన్నవాడుగ్రముగ నీఘటోత్కచుండు"

ఇందు కోపవిస్ఫూర్తి చక్కగా నగపడుచున్నది. కాని యీకోప ప్రదర్శనము కీమె యితరకవుల వలె కటు శబ్ద పూరితములగు నిష్ఠురపదముల నాశ్రయింపక కేవలము సుగ్రమగు అర్థశక్తిచేతనే తద్రసస్ఫూర్తి కల్గించి "తలపులోతుల నరమందలవరించి"నది. పలుకుపోగరతో రమణీయార్థ శిల్పముల చిత్రించు పరమ శిల్పుల కివియలంతులేకదా!

ఇటులే యనన్యసామాన్య ప్రతిభతో అద్వితీయకవితా ప్రకర్షతో, కవిత్వమొక యుపాసనగ, రచన మొక పవిత్రదీక్షగ, కావ్యోద్యోగమొక నియతజీవనవిధిగ "క్షురస్యధారానిశితాయివ ... కవనంతత్కవయో వదంతి"యను ఉపనిషత్సూక్తికి సార్థకత భజించి సరస్వతీ ప్రియసేవికయై కవయిత్రీమణుల తలమానికమ్మై తనరారిన మా సెచ్చెలిలేఖిని యాశాశ్వత మమృత నిష్యంది లేఖినియే. తద్రసపాన మత్తులగు పఠిత్వలోక మాశాశ్వతము ధన్యజీవనులే.

కరుణాళుడగు భగవానుడట్లే యాశీర్వదించును గావుత.

డా. లక్ష్మీకాన్తమ్మ

——(౦)——

# అతిథిసత్కారం

శ్రీ వసంతరావు రామకృష్ణారావు

అతిథిని సత్కరించటం ప్రాచీనకాలం నుండీ మనభారతదేశ సాంప్రదాయమై యున్నట్లు తోస్తుంది. మన చరిత్రలో, పూర్వము, రాజులు పరదేశస్థులను గౌరవ ప్రదంగా ఆదరించినట్లుకూడా వుంది. అతిథి అనే పదానికి, తిథిఎరుగకుండా సర్వదా తిరుగువాడనీ, ఒకరోజుకంటె ఎక్కువ కాలము నిలువని నూతనవ్యక్తిఅనీ అర్థాలు వున్నాయి. అభ్యాగతిఅంటే భోజనము వేళకు వచ్చినవాడనిభావం. పూర్వం యీ అతిథులను అభ్యాగతులను సత్కరించటం గృహిణీ గృహస్థుల ధర్మంగానుండేది.

దానికి తార్కాణంగా, "అతిథులే తేర నడికిరేయైన చెట్టు, వలయు భోజ్యమ్ము లింట నవ్వారిగాగ" అని మనుచరిత్రలో, పెద్దనూర్యుడు ప్రవరుని భార్యను వర్ణిస్తాడు. అంటే, నిత్యజీవితంలో, దైనందినమూ, తమ గృహాలకువచ్చే, అతిథి అభ్యాగతులను సత్కరించి, వలసిన సపర్యలుచేయటం గృహిణీమణుల కార్యంగా వుండేదని తెలుస్తోంది. ఒక్కమాటలో చెప్పాలంటే, 'అతిథి సత్కారం' గృహలక్ష్మికి విశిష్టలక్షణంగా మన పూర్వులు పరిగణించేవారు.

అయితే, కాలప్రవాహంలో, పరివర్తనల ఫలితంగా, శీఘ్రగమనంతో మార్పులుచెందే యీప్రపంచంలో, నేడు, ప్రాచీన సాంప్రదాయాలకు స్థానం లేకపోవటం వాస్తవమే. మానవుడు, అత్యధికమైన విజ్ఞాన తృష్ణతో కృషిచేసి, పెక్కు నూతనవస్తు పరిశోధనల మూలంగా, మానవసంఘంలోను, దేశంలోను, మొత్తం ప్రపంచమంతటిలోను, విపరీతమైన మార్పులను కలిగించాడు.

ఆ కారణంచేతనే, సాంప్రదాయాను సారం, మన గృహిణులకుండవలసిన, భిక్షా ప్రదానం, అతిథిసత్కారంవంటి పెక్కు పవిత్రలక్షణాలు విశేషించి నిలచియుండలే నట్లు తోస్తోంది. అయినప్పటికీ ప్రాచీన కాలంనుంచి వస్తోన్న, అతిథిసత్కారం మాత్రం, నేటికీ మనకుటుంబాలలో నిలచి వుండటం, నిజంగా హర్షించవలసిన విషయం.

అతిథిని సత్కరించటం సామాన్య విషయంకాదు. అతిథియెడల గృహస్థునికి గౌరవాదరాలుండాలి. అంటే అతిథుల్ని తన గృహానికి రమ్మని ఆహ్వానించటం గృహస్థులపని; వారిని ఆదరించి, సపర్యలు చేయటం గృహిణులధర్మం. కాగా, వారికి సౌకర్యాలు కలిగించటానికి కార్యభారంగల పురుషునికి పీలుపడదు; వాటినన్నిటినీ సమకూర్చే బాధ్యత గృహలక్ష్మి వహించాలి. అంటే తనకు నిత్యంవుండే పనులతోపాటు, అతిథుల అవసరాలను గ్రహించి, సదుపాయాలు కలిగించటానికి, గృహిణులకు యెంతైనా ఓర్మివుండాలి. ఆవిధంగా అతిథి అభ్యాగతులను సంతృప్తికరంగా సత్కరించేవారు స్త్రీలు; ముఖ్యంగా గృహిణులే అన్నమాట.

ఈ అతిథులు, అభ్యాగతులు, అధిక సంచారపరులు; వారు విశేష సంచారానంతరం గృహస్థులయింట అతిథులై, వారు

చూసినవింతలు,విషయాలను గృహిణీ గృహస్థులకు తెల్పేవారు. తైర్థికులు, అతిథులుగా వచ్చినప్పుడు, వారు, తాము సందర్శించిన పుణ్యక్షేత్రాల మాహాత్మ్యంగూర్చి గృహమేధికి వర్ణించేవారు. ఆవిధంగా, పూర్వం, అతిథులరాకవలన, గృహస్థాశ్రమంలోని వారికి నూతన విషయాలు తెలిసేవి. అతిథి సత్కారం జరుగుటవల్లనే సంచారపరులకు గృహయజమానులకు పరస్పరము ఒకబాంధవ్యమేర్పడి, విషయాలను తెలిసికోగలిగే వారు.

కాని, నేటి ప్రపంచంలో, ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా అలాంటి అవకాశాలు లేకపోవటం, శోచనీయం. నేటికీ మన అతిథి అభ్యాగతులు, కార్యక్రమాన్ని సాగిస్తున్నారనే నానమ్మకం. విశాలమైన మనదేశంలోని వివిధప్రాంతాలలో, అనాదినుండి పేరుగాంచిన పుణ్యస్థలాలు మెన్నోవున్నాయి. ఆయాస్థలాలకు అరుదెంచే తీర్థయాత్రాపరులు అతిథులుకదా! వారికి సౌకర్యాలు కలిగించి సత్కరించేదెవరు? ఆతిథ్యానికి పేరుపొందిన మనదేశంలో, స్వదేశవాసులను సత్కరించటానికి పరిస్థితులే అంతరాయంగా వున్నట్లు తోస్తుంది. నేడు, అట్టి సదుపాయాలను కలిగించటానికి మనకు అట్టే అవకాశాలుకూడా లేవు; యితరత్రా అట్టి వసతి సౌకర్యాలు కల్పింపబడ్డాయికూడా. అయినప్పటికీ, యీ ఆతిథ్యస్వీకారానికి అలవాటుపడ్డ ఛాందసులు యెవరియింటనో అతిథిగా వెళ్లటం నేటికీజరుగుతోంది.

అంతేకాదు; మనదేశంలోని పశ్చిమోత్తర ప్రాంతాలలో నివసించే కుటుంబాలు కొన్ని నేటికీ అతిథులను సత్కరిస్తున్నాయి. అందులో ప్రధానంగా పఠానుజాతివారు యీవిషయంలో నేటికీ మార్గదర్శకంగా వున్నారు. ప్రాచీనకాలంనుండి వస్తోన్న యీ అతిథిసత్కారం, నేటి పరిణతయుగంలోనూ ప్రధానస్థానం వహించిందనటానికి యిది ఒక ప్రబల నిదర్శనం!

ఇంతకూ, మనభారతదేశం, ఆగంతుకులను ఆదరించింది. అతిథిఅభ్యాగతులను సత్కరించింది. విదేశవాసులను ప్రేమపూర్వకంగా ఆహ్వానించి, ఆతిథ్యమిచ్చి గౌరవించింది. మన భారతీయకుటుంబాలు పరస్పరం సుహృద్భావాలతో ఆతిథ్యాన్ని పాటించుకొన్నాయి. అందువల్లనే అతిథిని సత్కరించటంలో ప్రపంచమంతటిలోను మనదేశం పేరుగడించుకొంది. ప్రాచ్యఖండంలో విశిష్టస్థానం వహించింది. భారతదేశం ఖండాంతరఖ్యాతి గడించటానికి, మన స్త్రీలుచేసిన అతిథిసత్కారమే కారణం. మనదేశంలోని గృహిణీమణులు, విశాల హృదయంతో, ఓర్మితో అతిథులను సత్కరించి, గృహస్థులకు, దేశానికీ పేరుగడించారు.

నేడుకూడా, చిరసాంప్రదాయానుసారమైన యీ ఆతిథ్యానికితగిన దోహద మీయవలసిన బాధ్యత స్త్రీలపై, ముఖ్యంగా గృహిణులపై ఆధారపడివుంది.

(176-వ పేజి తరువాయి)

"ఓహో అలాగా చెప్పనేలేదే. అయ్యో నేనో సారి వచ్చి చూచిపోయేదాన్నే. ఆ మెను చూచి ఎన్నో యేళ్ళయింది. పాపం ఏమనుకుందో" అన్నాది.

నాకప్పుడు యేం మాట్లాడాలనో, నవ్వాలనో, యేడవ్వాలనో తెలీదు. పాపం రాజ్యం తన్ను చాల ప్రేమిస్తుందని సుజాత అభిప్రాయం. రాజ్యానికి సుజాత అంటే నిప్పులో ఉప్పు అని తెలీదు. యేం చెయ్యను మరి.

ఇలా జవాబిచ్చాను. "లేదు సుజాతా! పనితొందరలో యీమధ్య నిన్ను తలుచుకోటమే లేదుగా. ఎలా చెప్పడం మరి."

"అది పోనియ్యండి. మీకిప్పుడు మందు రొట్టె ఇచ్చేది ఎవరు."

"అబ్బే. దీనికి మందెందుకూ. లంకణం పరమౌషధం అన్నారు. రేపటికి తగ్గిపోతుంది." కాని ఆవిడ ఒప్పుకోకండా సీసా పట్టుకెళ్ళి మందున్నూ, రొట్టె తెచ్చింది. తాను గూడ ఆరోజు, మరురోజు సెలవుపెట్టి నాకు పరిచర్య చెయ్యటం మొదలెట్టింది. మౌనముద్ర వహించి అన్నిటిని ఒప్పుకొన్నా. జ్వరం నయమైన తర్వాత ఎప్పటి వలెనే హోటల్లో భోంచేయడానికి మొదలెట్టా సుజాత భయమువల్ల.

ఇం లో రాజ్యానికి మగపిల్లవాడు పుట్టాడని ఆఫీసు "తంతి" వచ్చింది. సుజాత ఆనందం చెప్ప నలవికాదు. వెయ్యిసార్లు నాకు కంగ్రాచులేషన్సు చెప్పింది. నేనుమాత్రం అన్నిటికి మౌనం వహించాను. వారంరోజులు సెలవుపెట్టి మూడవరోజే అత్తారింటికి బయల్దేరాను.

అక్కడ తొమ్మిది రోజులుగడిచినై. పదవరోజు "బారసాల," పిల్లవానికి నామకరణం చెయ్యడం. దగ్గరి మిత్రులకు ఆహ్వాన పత్రికలు పంపాం.

సాయంత్రం నాల్గైంది. అందరికీ భోజనాలైనాయి. హాల్లో కూర్చొని వున్నాం. పిల్లవాణ్ణి ఒళ్ళో వుంచుకొని రాజ్యం కూడ అక్కడనే వుంది. ఇంతలో వాకిట్లో యేదో చప్పుడైంది, గబగబ సంచి ఒకటి చేతపట్టుకొని, సుజాత లోనికి ప్రవేశించేసరికి నాకు ముచ్చెమటలు గ్రమ్మినై "సుజాతా! రండి, కూర్చోండి" అనగానే ఆకుర్చీలో కూర్చుంది. "ఆహ్వానం లేకుండానే వచ్చేసా. నాకాహక్కుంది కాబట్టి," అన్నాది నవ్వుతూ. ఆమాటన్నది నాపై మమకారము, స్నేహభావముచేత నేనని నాకు బాగాతెలుసు. అందుచేనేను, "మీకు మేమాహ్వానాలేంటి పంపేది" అన్నా ముక్తసరిగా అంతలో "పిల్లాడేడీ?" అని రాజ్యం దగ్గరకెళ్ళి "ఇదుగో రాజ్యం, పాపకి చొక్కా పెడ్డీ" అని చిన్న సిల్కు చొక్కా పెడ్డీని సంచిలోంచి తీసి ఇవ్వబోయింది.

ఇదంతా చూస్తున్న రాజ్యం మండిపడి పోతుంది. ఉరిమి చూస్తూ, "నిన్నెవ్వరమ్మ రాన్నా రిక్కడికి. మద్రాసులో అల్లాడిచ్చేది కాకండా ఇక్కడికీ వచ్చావా శనిగ్రహంలా. నీచొక్కాలకైమేం కాచుకోండలే. తనకేవో హక్కట ..." అంటూంటే సుజాత రాయివలె ఆట్లే నిలబడి పోయింది. నేను మంత్రగానిచే నోరు కట్టివేయబడ్డటుల స్తంభించి పోయ్యాను. అంత సుజాత, "క్షమించు రాజ్యం" అన్నది. చొక్కా చెడ్డీ తెలీకండానే క్రింద పడ్డది. తాను సరాసరి వీధిలోకి నడిచింది. నాకు దిక్కు దోచలేదు, ఒక్కనిముసానికి తెలివి వచ్చి వేగంగా వాకిట్లోకి పోయినా. యేదీ సుజాత? "సుజాతా,, సుజాతా -" ... ఇంకెక్కడి సుజాత!

---o---




# స్ఫోటకం

ఇది అంటువ్యాధి. దీనిని అమ్మవారి పేర్లతో పిలుచుచు వైద్యసహాయమును పొందగూడదను మూఢనమ్మకముతో మనవారు అనేకమంది ప్రాణహానికి కారణమగుచుందురు.

ఈ సందర్భమున అంటువ్యాధికాబట్టి వ్యాధిగ్రస్తులను ప్రత్యేక ప్రదేశములకు చేర్చడం, పరిశుభ్రమైన గదులయందు గాలివసతిగల వానిలో నుంచడం, మలమూత్రములు సాఫీగా పోవునట్లు పరిచర్యలు చేయడం అనుసరించవలసిన విధానము. వానికి తోడు వైద్య సహాయమును పొందవచ్చును. సాధారణముగా గృహవైద్యము కూడ వ్యాధి ఉపశమనమున కుపకరించును.

అరటిదుంప, వేళ్లు, దూట, పొత్తి వీనిరసము 3,4, తులములఎత్తు సేవించినచో స్ఫోటకము శమించును. కుంకుమపువ్వును నిమ్మరసముతో నూరి ఒంటికిపట్టించిన స్ఫోటకపు పొక్కులు వృద్ధియగును.

కస్తూరిపసుపును బాగుగానూరి ఒంటికిపట్టించిన స్ఫోటకపు పొక్కులు మానును.

కాఫీ తేలిక కషాయము స్ఫోటకవ్యాధిగ్రస్తులకు మేలుచేయును.

12 సం॥ల బిడ్డలకు స్ఫోటకము రాకుండా చేయుటకు వరుసగా 5,6 రోజులు గుర్రపుపాలు యియ్యనగును.

నేలతాడిగడ్డలను మెత్తగా చూర్ణముచేసి నువ్వుల పొడితోకలిపి దినమునకు 2 దిరములఎత్తు సేవించినచో స్ఫోటకము నిమ్మళించును, ఒత్తుగా స్ఫోటకపుపొక్కులు లేచినప్పుడు వేపనూనెను దేహమంతయు పూయుచుండిన బహుతేలికగా పొక్కులుమాని బాగగును. వేపాకును పసుపుతోనూరి నూనెకలిపి ఉడికించి పూసిన స్ఫోటకపు కురుపులు త్వరగా నయమగును.

గోరింట ఆకును నూరి అరికాళ్లకు కట్టిన కండ్లలో స్ఫోటకము తగలదు.

—(o)—

# లోక వార్తలు

శ్రీ సి. రాజగోపాలాచారిగారి మంత్రివర్గము 10 వ తేదినాడు ఉదయం 11 గంటలకు ప్రమాణము స్వీకరించింది.

◆ ◆ ◆

కాంగ్రెస్ సభ్యత్వరుసుం తిరిగీ పావలాకును, సంఘాల వ్యవహర్తలకు రూపాయికిని రుసుం తగ్గించ బడింది.

◆ ◆ ◆

భారతదేశ అందాలరాణిగా శ్రీమతి ఇంద్రాణి రెహమాన్ గారు ఎన్నికైరి. శ్రీమతి సూర్యకుమారికి ద్వితీయ స్థానము లభించెను.

◆ ◆ ◆

ఈఏటిగృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత స్థానాపతి రుక్మిణమ్మగారికి విశాఖ పౌరులు మార్చి 31 తేది స్వర్ణకంకణమిచ్చి సన్మానించిరి.

◆ ◆ ◆

స్టేటుకవున్సిలుకు కళాక్షేత్ర నిర్వాహకురాలు శ్రీమతి రుక్మిణీదేవిగారు ఎన్నుకోబడిరి.

◆ ◆ ◆

అందాల పోటీలు నింద్యాలని శ్రీ పురుషోత్తమదాసు టాండన్ నిరసన తెలిపారు.

◆ ◆ ◆

భారతీయ గాయకుల నాదోపాసన గొప్పదని జగద్విఖ్యాతి వాయులీను విద్వాంసుడు మెనుహిన్ ప్రశంశించాడు,

◆ ◆ ◆

చైనాకు పయనమగు భారతీయ రాయబారవర్గమునకు శ్రీమతి విజయలక్ష్మి పండిట్ నాయకత్వము వహించును. శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మ గారు సభ్యురాలుగా నుందురు.

◆ ◆ ◆

భారత దేశ అధ్యక్ష పదవికి డా. రాజేంద్ర ప్రసాద్ గారిని, ఉపాధ్యక్ష పదవికి డా. సర్వేపల్లి రాధాకృష్ణ గారిని కాంగ్రెస్ ప్రతినిధులుగా నిర్ణయించబడింది.

◆ ◆ ◆

రష్యా సహాయ విదేశాంగ మంత్రి ఏప్రిల్ నాల్గవ తేది భారత రాయభారి డా. రాధాకృష్ణ గారికి వీడ్కోలు విందు చేశారు.

◆ ◆ ◆

నిలవవస్త్రం పూర్తిగా విడుదల అయ్యే వరకు ఉత్పత్తి నిలుపుదల చేయడానికి అహమదాబాద్ మిల్లు యజమానులు నిర్ణయించారు.

◆ ◆ ◆

రాయలసీమ క్షామప్రాంతాలకు ద్రవ్యరూపమునను, వస్తురూపమునను వివిధ సంఘాలు, ప్రాంత్యాలు సహాయమును సమీకరిస్తున్నవి.

◆ ◆ ◆

హోటళ్లలో వడ్డనలు చేసేటందుకు, వంటకములు చేసేటందుకు, ఫలహారమందిరములు, భోజనశాలలను నిర్వహించేటందుకు కావలసిన శిక్షణ నొసగి సమర్థులైన పాకప్రవీణులను తర్ఫీదుచేసి, పరీక్షలో నుత్తీర్ణులైన వారికి పట్టమును యిచ్చుటకు బొంబాయిలో అఖిల భారతమహిళా నిర్వర్తిత ఆహారమండలి సంకల్పించింది. ఈశిక్షణ మూడు నెలల కాలముట.

◆ ◆ ◆

ఆహార కరువుతోబాటు నీటి ఎద్దడికూడ గుడివాడ, కైకలూరు తాలూకాలలోను, మద్రాసు నగరం, ఒంగోలు మొదలగు ప్రాంతములలో విషమంగా నున్నది.

◆ ◆ ◆

ఫ్రాంటియర్ గాంధి (గఫర్ ఖాన్ ను) విడుదల చేయవలసినదిగా పాకిస్థాన్ సోషలిస్టులు ఆందోళన చేస్తున్నారు.

◆ ◆ ◆

మాజీ కేరళ మంత్రిణి మిస్. అన్నీమాస్కరీన్ మానసష్టం కలిగించే ఉపన్యాసం చేసిందని 500 రూపాయల జరిమానా లేక 3 నెలల ఖైదు మేజస్ట్రేటు నిర్ణయించాడు.

◆ ◆ ◆

సర్వోదయ సమాజ కార్యకలాపాలకు కాలాన్ని పూర్తిగా వినియోగించడానికిగాను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యత్వానికి మాజీ కాంగ్రెస్ కార్యదర్శి శంకరరావుదేవు రాజీనామా యిచ్చారు.

◆ ◆ ◆

స్థానికమహాలక్ష్మి కరణమందిర పక్షమున మహిళాభ్యుదయ ఉత్సవములు మూడురోజులు శ్రీమతి తమ్మా కోటమ్మ రెడ్డిగారి అధ్యక్షతన గుంటూరులో జరిగెను.

◆ ◆ ◆

మద్రాసు రాష్ట్రంలో క్షామనివారణ నిమిత్తం లక్ష రూపాయలను మంజూరుచేయ భారతక్షామ నివారణనిధి మానేజ్మెంటు బోర్డువారు న్యూఢిల్లీలో నిశ్చయించారు.

◆ ◆ ◆

శ్రీ టంగుటూరు ప్రకాశంగారు మద్రాసు కౌన్సిలుకు ఎన్నుకోబడిరి.

◆ ◆ ◆

భారతదేశంలోని హిందుస్థానీ కర్ణాటక సంగీత బాణీలలో యీసంవత్సరమునకు కొందరిని ఉత్తమ విద్వాంసులుగా భారత ప్రభుత్వము నిశ్చయించింది. అందు కర్ణాటక సంగీత విద్వాంసులు శ్రీ అరియకూడి రామానుజ అయ్యంగారు, జంత్రం శ్రీ కారైకుడి సాంబశివ అయ్యర్ లు.

◆ ◆ ◆

పశ్చిమ బెంగాలులో డార్జిలింగ్ జిల్లాసరిహద్దున సిక్కింగు దక్షిణ ప్రాంత్యంలో రంగీతోయలో 100 చదరపుమైళ్ల వైశాల్యం గల ఒక పెద్దబొగ్గుగని కనుగొనబడింది.

◆ ◆ ◆

"భారత దేశంలో ప్రజాస్వామ్యాన్ని డాలర్లతో కాదు సరిగదా ఆహారంయిచ్చి అయినా కొనలేము. అచ్చట చేయవలసినదల్లా భారతీయులతో కలసి గ్రామ గ్రామంలోనూ దారిద్ర్య నిర్మూలనానికి వారుచేస్తున్న కృషికి సహకరించడమే" అని అమెరికను రాయబారి బౌల్స్ వివరించాడు.

◆ ◆ ◆

అఖిల భారత గ్రామ పరిశ్రమల సంఘాధ్యక్షుడు డా. జె. సి. కుమారప్పగారు అంతర్జాతీయ ఆర్థిక సమావేశంలో పాల్గొనడానికి మాస్కోకు వెళ్లాడు.

◆ ◆ ◆

15 మైళ్ల ఎత్తునున్న విమానాలనుకూడ కూల్చ గలిగిన ఒక స్వయం చోదితమైన రహస్యాస్త్రాన్ని నిర్మించడానికి అమెరికా శాస్త్రజ్ఞులు ప్రయత్నిస్తున్నారు.

◆ ◆ ◆

రాయలసీమ క్షామనివారణకు వినియోగించు నిమిత్తం శ్రీమతి దుర్గాబాయమ్మగారికి 116 రు.లు తిరుపూరు ఆంధ్రమహిళా బేసిక్ శిక్షణాకేంద్రము వారు వసూలుచేసి పంపారు.

◆ ◆ ◆

కమ్యూనిస్టునాయకుడు శ్రీ పి. రామమూర్తిగారు కౌన్సిలుకు రాజాజీ నామినేషను పై దాఖలుచేసిన ఆక్షేపణను మద్రాసు హైకోర్టు త్రోసివేస్తూ తీర్పు చెప్పింది; కాని సుప్రీంకోర్టుకు అప్పీలు చేయడానికి అనుమతి యిచ్చింది.




## మూడు మాటలు నిజమైనవి,

ఒకరాజుకు ఆరుగురు కుమారులు ఒకకుమార్తె కలరు. ఆరుగురు కుమారులకు వివాహమైనది. కుమార్తెకు వివాహము కాకమునుపే వారి తల్లిదండ్రులు స్వర్గస్థులైరి. ఆరుగురు అన్నలు చెల్లెలను అతి గారాబముతో పెంచుచుండిరి. వదినలకుమాత్రము ఆడబిడ్డమీద లోపల అసూయ, 'ఈమెకు మేమెందుకు సేవలు చెయ్యవలెను?' అని.

ఇట్లుండగా ఒకదినము రాజకుమారులు ఆరుగురు వేటకువెళ్ళుచు చెల్లెలిని తామువచ్చువరకు యేమాత్రము ఆమె మనసుకు కష్టము కలిగించక జాగ్రతగా చూడమని యెవరి భార్యలకు వారుచెప్పి వేటకు వెళ్ళిరి. ఆమెపేరు సుశీల. పేరుకుతగినట్లు సుగుణములుకలది. తమభర్తలు వెళ్ళగానే వారుచెప్పినదానికి విరుద్ధముగా వేడినీళ్ళకుబదులు చల్లనీళ్ళు శిరస్సుమీద పోసినట్లు చూసిరి. ఒకదినము సుశీల చింతగా కూర్చొనియుండెను. చిన్నవదిన పోయి "నీవు అలిగి ఆలింగరాజును పెండ్లాడి, గంటలకాముని, మువ్వలముద్దుని, కుమారులనుగని, నీముద్దుల భర్తను దగ్గరపెట్టుకొని మాకు వెండిఅన్నము, బంగారుపప్పు పెట్టకుంటే మానెలే; భోంచేస్తువురా" అని పిలిచింది. సుశీల ఆరాత్రి అందరిని నిద్రపోనిచ్చి అర్ధరాత్రిలో యెక్కడికో వెళ్ళిపోయింది. తెల్లవారి వదినెలు సుశీలను మహాలంతయు వెదకి ఆమె యెక్కడికో పోయినదని భావించి యిక తమ భర్తలువస్తే యేమి చెప్పటమూ అని ఆలోచించిరి. వారిలో పెద్దఆమె తులసికోట కట్టించి తులసీచెట్టు దానిలోనాటి ఆమొక్కకు మనము ప్రతిదినము నీరుపోయుచుందుము. మనము భర్తలువస్తే "మీచెల్లెలు తులసిచెట్టుఅయినది. ఆచెట్టును మేము భక్తిశ్రద్ధలతో చూచుచున్నామని చెప్పుదమనెను. తక్కినవారందరు సరేనంటే సరేననిరి. రాజకుమారులు వేటనుండి మరలివచ్చిరి. వారు సుశీల యేదని అడుగగానే వారు ఆలోచించినట్లే చెప్పిరి. వారు నిజమేనని దుఃఖించి చేయునదిలేక వూరకుండిరి. సుశీల వెళ్ళినప్పటినుండి వారికి ఐశ్వర్యము తగ్గుచుండెను.

సుశీల పోయిపోయి ఆలింగరాజు పట్టణముచేరెను. ఆ పట్టణ ప్రజలను మిమ్ములను పరిపాలించే రాజెవరని అడిగెను. వారు "ఆలింగరాజు పరిపాలిస్తూయుండెను, ఆయన

ఆరు మాసములక్రిందట చనిపోయెనని" తెల్పిరి. సుశీల ఆయనను సామాధిచేసిన చోటు తెలుసుకొని దానిపై పరుండి యేడ్చుచుండెను. ఆరాజు ఆయువుతీరి మరణించలేదు. నాగలోకములో ఏడుగురు నాగకన్యలు. వారిలో చిన్నామె ఆలింగరాజును మోహించి తన మాయచే అతని ప్రాణము తీసెను. పగలంతయు పురుషరూపముతో తనదగ్గరవుంచుకొని దివ్యసుఖములనుభవించుచు సూర్యాస్తమయము కాగానే తామర పుష్పముగా చేయుచుండెను. తామరపుష్పము చేస్తూనే ఇక్కడ సమాధిలోయున్న ఆలింగరాజుకు ప్రాణమువచ్చుచుండెను. సుశీల దీనారవమువిని యవరాయని బయటికి వచ్చి యాకన్య సుఖకష్టముల విచారించెను. ఉన్నదున్నట్లు ఆమె తనచరిత్ర తెల్పెను. రాజు సుశీలయం దత్యంత అనురాగముగలవాడయి అనుదినమును రాత్రులందు ఆమెతో సుఖముగానుండెను. ఇట్లుండగా ఆమెగర్భవతిఅయి నవమాసములు నిండెను. రాజామెతో నీకు ప్రసవదినములయినవి. మాతల్లికి నేరేడు పండ్లంటే చాలప్రీతి. ఆపళ్ళు కోసుకొని మామహాలుదగ్గర అమ్ము. అప్పుడు మాతల్లి దాదినిపంపి నిన్ను పిలిపిస్తుంది. అప్పుడు నీపళ్ళు ఆమెకుఇచ్చి, "నేను అనాధను ప్రసవించేట్లుగా యున్నాను. దయయుంచి ఒకగది యివ్వమని ప్రార్థించు. మాతల్లి నేను వుంటున్నగది చూపుతుంది, అదియెవరు తీసినా రాదు. నీవు తాకుతూనేవస్తుంది. ఆగదిలోనే ప్రసవించుమని" చెప్పెను. సుశీల రాజు చెప్పినట్లె చేసి ఆగదిలో ఇరువురు మగశిశువులను ప్రసవించెను. రాజుతల్లి సుశీలదగ్గర ఒక చెవిటామెను ఒక గ్రుడ్డిఆమెను సేవలుచేయుటకుంచెను. ఆరాత్రికి ఆలింగరాజు వచ్చి తనతల్లి బిడ్డలను నిన్ను బాగా చూచుచున్నదా లేదాయని అడిగిపోయెను. తెల్లవారి దాదులిద్దరు రాజు తల్లిదగ్గరకుపోయి రాత్రి యవరో ఒకాయన వచ్చినాడు. అంతా ఆలింగరాజువలె యున్నాడని చెవిటిఅమె చెప్పెను. గ్రుడ్డిఆమె మాతల్లి నిన్ను బాగ చూస్తున్నదా లేదాయని సుశీలనడిగెననీ చెప్పెను. ఇదియేమో చూస్తామని చెవిటిఆమెను వేరుగదిలో పడుకోమని ఆమె సుశీలగదిలో పండుకొనెను. వారుచెప్పినట్లు తనకుమారుడు ఆలింగరాజువచ్చెను. తల్లివానిని కౌగలించుకొని దుఃఖించెను. కుమారుడు తనగుట్టంతయు తెలిపెను. తల్లి సరెననెను. బిడ్డలకు గంటలకాముడు మువ్వల ముద్దుడు అని నామకరణముచేసి పురుడుచేయుచు నాగలోకమునకు వినబడునట్లు మంగళ వాయిద్యములు వాయించిరి. ఆలింగరాజు విచారపడునుపై నాకుమారులకు పురుడు చేయుచున్నారని నాగకన్యలతో చెప్పెను. వారు ఆయనకు సంతోషము కలిగించుటకు "మనము చూచివస్తాము పదమని" తామరపుష్పముగాచేసి ఆలింగరాజును చేతిలో పట్టుకొని అచ్చటికివెళ్ళిరి. వారు వస్తూనే రాజుతల్లి మంగళ స్నానములుచేయించి పట్టు

వస్త్రములు ఆభరణములిచ్చెను. నాగకన్యలు చూచుచుండ బిడ్డలిద్దరిని పల్లేరుకాయల మీద వస్త్రముపరచి పరుండబెట్టెను. వారు నిలువలేక యేడ్చుచుండిరి. యేడ్పుకు కారణమేమని నాగకన్యలడిగిరి. రాజుతల్లి ఆమె చేతిలోని తామరపుష్పము కొరకేడ్చుచున్నారని చెప్పెను. ఆమె అక్కలు "మనకు కావలసినన్ని పుష్పములున్నవి. ఆపుష్పము బిడ్డలకు ఇవ్వమని" చెప్పిరి. అట్లు ఆమెయివ్వగ మండుచున్న పొయిలో వేసెను. నాగకన్యలు అదృశ్యమైరి. రాజుతల్లి తత్క్షణమే నీళ్ళుచల్లి పువ్వును జాగ్రతగాతీసెను. ఆలింగరాజు తత్క్షణమే తల్లి, భార్య, పుత్రుల దగ్గరకువచ్చెను. వారికి అమితానందము కలిగెను. పట్టణ జనులది తెలిసి తమరాజు చిరంజీవుడైనందులకు ఆనంద పరవశులైరి.

సుశీల ఆరుగురు అన్నలు వదినలు తమ రాజ్యములో బ్రతకజాలక ఈపట్టణములో కట్టెలమ్ముకొనుచుండిరి. ఒకదినము మహలుమీదినుంచి సుశీలచూసి తన అన్నలు వదినలని గుర్తుపట్టి సేవకునిపంపి వారిని తనయింటికి రప్పించి మంగళస్నానములుచేయించి దివ్యవస్త్రము లిప్పించెను. వారికి తమచెల్లెలయినది తెలీయదు. రాత్రికి అందరికి భోజనానికి తయారుచేయించి వదినలదగ్గరకువచ్చి 'అలిగి ఆలింగరాజును పెండ్లాడి, గంటలకాముడిని, మువ్వలముద్దుణ్ణికని, ముద్దులభర్తను దగ్గరపెట్టుకొని వెండి అన్నము, బంగారుపప్పు వడ్డించినాను, భోంచెయ్యండి' అనిచెప్పెను. వదినెలు విచారవదనులై తలలు క్రిందకువంచిరి. అన్నలు జరిగినదంతయు గ్రహించి భార్యలను సంహరింపబోయిరి. సుశీల అన్నలచేతులు పట్టుకొని "వారిని యేమిచెయ్యవద్దు వారనబట్టె నాకీ ఐశ్వర్యమంతానని" అన్నలను శాంతింపచేసెను. అన్నలను వదినలను తనదగ్గరే యుంచుకొని అత్యంతదయతో చూచుచూ భర్తా పుత్రులతో అత్తగారును స్వర్గసుఖాలనుభవించుచు సుశీల సుఖముగానుండెను.

కె. సావిత్రీదేవి

---

# తెలుగు భాషా సమితి

తే. 19-12-1947 దీ గల జి. ఓ. ను అనుసరించి మదరాసు గవర్నమెంటు, తెలుగుభాషా సమితి ద్వారా, ఈక్రింది విషయములలో ఉత్తమ గ్రంథములకు 1952-1953 వ సంవత్సరానికి బహుమతులు ఇవ్వబడును.

**1.** కథా ప్రధానములు కాని ఖండకావ్యములు, గేయములు, స్వంత రచనలు.

ఇందులో కథలను సూచనలుండ వచ్చును. కాని కావ్యము మొదటినుండి చివరవరకును కథలపై ఆధారపడి యుండరాదు. ముఖ్యముగా కావలసినవి - కవితా చమత్కృతి, భావ సంపద, వర్ణనలు మొదలయిన కవితా లక్షణములు. గ్రంథమంతా మొత్తము 500 పద్యములకు రెండువేల చరణములకు తక్కువ ఉండరాదు. స్వతంత్రరచనలే కాని అనువాదములు పనికిరావు.

**2.** తెలుగు సాహిత్యమందలి హాస్యరసము.

హాస్యరసమనగా నేమి? దాని లక్షణములేవి? నవరసములలో దీనికిగల స్థానమేది? హాస్యరస ప్రధానమైన గ్రంథమెట్లుండును? తెలుగు సాహిత్యములో మొదటినుండి నేటివరకును హాస్యరస ప్రధానములయిన గ్రంథములేవి? ఎట్లున్నవి? ఆ గ్రంథములందును ఇతరములయిన తెలుగు గ్రంథములందును హాస్యరసమెంత వరకెట్లు పోషింపబడినది.

**3.** జానపద గేయ విమర్శ.

జానపద గేయములనగా ఎట్టివి? వాటిలక్షణములెట్లున్నవి? తెలుగు సాహిత్యములో జానపద గేయములకుగల స్థానమేది? జానపదగేయములందలి కథావస్తువు, కల్పనలు, భావములు, లోకోక్తులు చమత్కృతులు వివరించి విమర్శింపవలెను. అందులో సాంఘిక జీవిత మెంతవరకెట్లు ప్రతిబింబితమయినదో రూపించవలెను. జానపదగేయములందలి భావ, ఛందస్సు, సంగీతముకూడా విమర్శించవలెను.

**4.** గృహ నిర్వహణ శాస్త్రము.

గృహ నిర్వహణమునకు బాధ్యులయిన వారు - అందు ముఖ్యముగా గృహిణులు నేర్చుకోదగిన శాస్త్రజ్ఞానము ఏయే శాస్త్రములందలి ఏయే భాగములు, ఎంతెంత వరకు అభ్యసించ వలెను? ఏవి ఎట్లు ఆచరణలో పెట్టవలెను?

**5.** ఆంధ్రదేశమందలి అడవుల సంపద.

అడవులెక్కడెక్కడ ప్రకృతి సిద్ధముగా పెరుగును? ప్రపంచమందలి అడవులలో సుప్రసిద్ధమైనవి ఎట్లున్నవి? అడవులలోని వృక్షములను ప్రయోజనములనుబట్టి ఎట్టి వర్గీకరణమును చేయవచ్చును? తెలుగు దేశములో అడవులు రక్షితములు, అరక్షితములు ఎక్కడెక్కడగలవు? ప్రభుత్వము వారి రక్షణము ఎట్లు సాగుతూ వచ్చినది? క్రొత్త రాజ్యాంగవిధానములో ఎట్టిమార్పులు వచ్చినవి? అడవులనుండి రాగల ఆర్థిక సంపద

వస్త్రములు ఆభరణములిచ్చెను. నాగకన్యలు చూడకుండ బిడ్డలిద్దరిని పల్లేరుకాయల మీద వస్త్రముపరచి పరుండబెట్టెను. వారు నిలువలేక యేడ్చుచుండిరి. యేడ్పుకు కారణ మేమని నాగకన్యలడిగిరి. రాజుతల్లి ఆమె చేతిలోని తామరపుష్పము కొరకేడ్చుచున్నారని చెప్పెను. ఆమె అక్కలు "మనకు కావలసినన్ని పుష్పములున్నవి. ఆపుష్పము బిడ్డలకు ఇవ్వమని" చెప్పిరి. అట్లు ఆమెయివ్వక మండుచున్న పొయిలో వేసెను. నాగకన్యలు అదృశ్యమైరి. రాజుతల్లి తక్షణమే నీళ్ళుచల్లి పువ్వున్ను జాగ్రతగాతీసెను. ఆలింగరాజు తక్షణమే తల్లి, భార్య, పుత్రుల దగ్గరకువచ్చెను. వారికి అమితానందము కలిగెను. పట్టణ జనులది తెలిసి తమరాజు చిరంజీవుడైనందులకు ఆనంద పరవశులైరి.

సుశీల ఆరుగురు అన్నలు వదినలు తమరాజ్యములో బ్రతకజాలక ఈపట్టణములో కట్టెలమ్ముకొనుచుండిరి. ఒకదినము మహాలుమీదినుంచి సుశీలచూసి తన అన్నలు వదినలని గుర్తుపట్టి సేవకునిపంపి వారిని తనయింటికి రప్పించి మంగళస్నానములుచేయించి దివ్యవస్త్రము లిప్పించెను. వారికి తమచెల్లెలయినది తెలీయదు. రాత్రికి అందరికి భోజనానికి తయారుచేయించి వదినలదగ్గరకువచ్చి 'అలిగి ఆలింగరాజును పెండ్లాడి, గంటలకాముడిని, మువ్వలముద్దుణ్ణికని, ముద్దులభర్తను దగ్గరపెట్టుకొని వెండి అన్నము, బంగారుపప్పు వడ్డించినాను, భోంచెయ్యండి' అనిచెప్పెను. వదినెలు విచార వదనులై తలలు క్రిందకువంచిరి. అన్నలు జరిగినదంతయు గ్రహించి భార్యలను సంహరింపబోయిరి. సుశీల అన్నలచేతులు పట్టుకొని "వారిని యేమిచెయ్యవద్దు వారనబట్టె నాకీ ఐశ్వర్యమంతానని" అన్నలను శాంతింపచేసెను. అన్నలను వదినలను తనదగ్గరే యుంచుకొని అత్యంతదయతో చూచుచూ భర్తా పుత్రులతో అత్తగారును స్వర్గ సుఖాలనుభవించుచు సుశీల సుఖముగానుండెను.

కె. సావిత్రీదేవి

---

ఎట్టిది? అది ఎంతవరకు తెలుగుదేశములో వస్తున్నది? రాగలదు? వివరణములు, పట్టికలు సేకరించి అడవుల సంపద విషయములను విశద పరచవలెను.

6. ఖగోళ శాస్త్రము.

ఖగోళశాస్త్రజ్ఞానము - సిద్ధాంతభాగము - ఏయే దేశములందెట్లుదయించి ఎంతవరకు అభివృద్ధి పొందినదో, దాని చరిత్ర సంగ్రహముగా వివరించి, ఈశాస్త్ర విషయములన్నీ నేటికి తెలిసినంతవరకు విశద పరచవలెను. శాస్త్ర పరిశోధన లింకను ఏయే మార్గముల సాగుచున్నవో వివరింపవలెను.

7. చెలామణి; మారకము.

అర్థశాస్త్రములో వస్తువినిమయము, నాణెములు, హుండీవ్యాపారము, బ్యాంకులు మొదలయిన విషయములు సంగ్రహముగా వివరించి చెలామణి (Currency) మారకము (Exchange) సకలదేశముల వ్యాపారములందును వ్యష్టిగతంగాను, సమష్టిగతంగాను, ఎట్లు సాగుచున్నవో, అంతర్జాతీయ సమస్యలుగా ఎట్లు పరిణమిస్తున్నవో నిరూపించవలెను.

బహుమతుల పోటీలో పాల్గొనువారు క్రింది హంశములను గుర్తించవలెను.

1. రెండు మొదలు 7 వరకు గల విషయములపై పంపబడు పుస్తకములు 1/16 డబుల్‌క్రౌన్ సైజులో 200 పేజీలకు తక్కువ వుండరాదు. (అచ్చులో . . .)

2. సం 1945 రం. కు పూర్వం ప్రకటింపబడ్డ గ్రంథాలు ఈపోటీకి తీసుకోబడవు.

3. అచ్చుపుస్తకాలయితే ఒక్కొక్కదానికి ఆరేసి కాపీలు, వ్రాత ప్రతులైతే రెండేసి కాపీలు, పంపించవలసివుంటుంది.

4. గ్రంథాలు 1953 ఫిబ్రవరి 28 వ తేదీకి, తెలుగు భాషాసమితి కార్యదర్శి, 27, యూనివర్శిటీ బిల్డింగ్స్, మద్రాసు - 5 కు అందచేయబడాలి.

5. ప్రతి ఒక్క విషయంలోని ఉత్తమ గ్రంథమునకును రు. 500 లు. బహూకరింపబడును.

6. శాస్త్రీయ విషయములకు సంబంధించిన గ్రంథాలలో శైలి సరళముగాను, సామాన్య ప్రజానీకానికి సుబోధకంగాను, తెలుగు నుడికారమున కనుగుణముగాను ఉండవలెను. సాంకేతిక పదముల వాడుక విషయములో ఈవరకే వాడుకలోనికి వచ్చిన తెలుగు పర్యాయపదములనుగాని, అంతర్జాతీయ పారిభాషిక పదములనుగాని వాడవచ్చును. తెలుగు పదములను వాడినచో మొదటిసారి ఇంగ్లీషు మూలమును ప్రక్కన చూపవలెను. అట్టి పదముల పట్టికను ఆంగ్ల మూలములతో సహా అనుబంధములో చేర్చవలెను.

7. లిఖిత ప్రతులు విస్పష్టముగ బోధపడు దస్తూరీలో వ్రాయవలెను. కొట్టివేతలుగాని, హంసపాదులుగాని సాధ్యమైనంతవరకు లేకుండా చూడవలెను.

8. పోటీకి పంపు అచ్చుపుస్తకములు తిరిగి రచయితలకు పంపబడవనిన్నీ, ఒక లిఖితప్రతులు మాత్రము బహుమతులు నిర్ణయింప బడిన అనంతరము తిరిగి పంపివేయబడగలవనిన్ని పోటీలో పాల్గొను రచయితలు గమనింపవలెను.

కార్యదర్శి

# అనువాద సాహిత్యం



"తెలుగు" మనదేశభాషలలో ఒక ప్రధానమైనభాష. అన్ని భాషలవలెనే తెలుగుభాషకుకూడ ఒక ప్రత్యేకత, ఒక విశిష్టత ఉన్నవి. తెలుగు సంస్కృతి, తెలుగు విజ్ఞానం, యుగ యుగాలుగా పరిపుష్ట మవుతూ, అద్వితీయస్థానాన్ని పొందగలిగినవి. ఈ పరిపుష్టికి, ఈ వికాసానికి తెలుగు వాఙ్మయంయొక్క పాత్ర ప్రముఖమైనది.

తెలుగు వాఙ్మయం సంపన్నమై, పరిపుష్టి నొందుతూ వచ్చిందంటే - ఇది ఒకనాటి ప్రయత్నం కాదు, ఒకనాటి సిద్ధి కాదు. శతాబ్దాల తరబడి పండితులు, మేధావులు, మహాకవులు ఈ వాఙ్మయాన్ని పోషించి, పెంపొందించి ఉన్నతస్థితికి తీసికొనివచ్చారు. పెక్కుమందికవులు తమ ఉత్కృష్ట రచనలచే తెలుగు సాహితిని అలంకరించినారు. సంస్కృతం, హిందీ, బెంగాలీ, మహారాష్ట్రం, కన్నడం, ఉర్దూ, ఇంగ్లీషు మొదలైన భాషలలోనుంచి అనేక రచనలను, ఉద్గ్రంథాలను అనువదించి, విభిన్న దేశ ప్రజల విజ్ఞానాన్ని, సంస్కృతిని, తెలుగుదేశానికి అందజేశారు. తద్వారా తెలుగు సరస్వతి నూత్నాలంకారాలను చేకూర్చుకొన్నది.

సహజముగానే తెలుగువాణి పటుత్వమైనది. తెలుగు భావన సునిశితమైనది. దానికితోడు ఈ భావనా బలాన్ని, నూత్న దృక్పథాన్ని తెలుగుజాతి సంతరించుకొన్నదంటే పరభాషల, ఇతర సంస్కృతుల పలుకుబడి, ప్రభావం కొంతవరకు లేకపోలేదు. పాశ్చాత్య ప్రభుత్వంక్రింద నిర్బంధంగా నేర్వబడిన ఆంగ్లభాష, పాశ్చాత్య విజ్ఞానం మనతెలుగు వారిలోనేకాదు, యావద్భారతంలోను క్రొత్త చూపులను, క్రొత్త ఆలోచనలను దారితీసినది. పాత సిద్ధాంతాలను క్రొత్త చూపులతో చూడసాగాము. ఇదివరకు అనుకోని క్రొత్త విషయాలు దృగ్గోచరం కాసాగాయి. మన భావనా ప్రవంతి క్రొత్త మార్గాల పరుగిడ సాగింది. పాశ్చాత్య నాగరికత దెబ్బతో భారతజాతి నాగరికత, సంస్కృతి, వాఙ్మయాలలో విప్లవం కలిగినదంటే అతిశయోక్తి కాజాలదు.

అనూచానంగా వస్తూన్న మనసంస్కృతికి, మన భావనలకు పరదేశాల సంపర్కం, పరదేశాల వాఙ్మయం ఏయే మార్పులను తీసికొని వచ్చినది? ఎంతవరకు తీసికొనివచ్చినది? అవి మనతెలుగుజాతి వికాసానికి తోడ్పడినవా? లేక మన అవనతికే హేతుభూతమయినవా? - అనే విషయాలనుగూర్చి తెలిసికోవాలంటే ఇతర భాషలలోనుంచి మనభాషలోనికివచ్చిన సాహిత్యాన్ని ఒకసారి పరికించిచూస్తే - తెలియగలదు.

"అనువాద సాహిత్యం" మనతెలుగుభాషమీదా, వాఙ్మయంమీదా, జాతిమీదా కావించిన పలుకుబడిని సమగ్రంగా చర్చించుకొని, తహవేలు వేసికోవడం ఎంతేని అవసరం. అట్లే మనభాష, మనవాఙ్మయం ఇతర ప్రాంతాలమీద ఎంతవరకు పలుకుబడిని చలాయించినది? ఏయే గ్రంథాలు, ఏయే రచనలు ఇతర భాషలలోకి అనువదింపబడినవి? అనే విషయాన్నిగూర్చికూడ తెలిసికోవడం సమంజసం.

ఈ ఉద్దేశ్యాన్ని పురస్కరించుకొనియే తెలుగు భాషాసమితి యాజమాన్యాన ఏర్పడిన సంస్కృతిసమితి పక్షాన త్వరలోనే ఒక మహాసభ జరుగనున్నది. ఇంతవరకు వేరువేరు భాషలనుంచి తెలుగు భాషలోనికి అనువదింపబడిన గ్రంథాలనుగూర్చి, వాటి ప్రభావం, పలుకుబడినిగూర్చి ఆయా శాఖలలో ఆరితేరినవారిచే ఉపన్యాసాలు ఇవ్వబడతవి; చర్చలు కావింపబడతవి. తెలుగులోనికి అనువదింపబడిన గ్రంథాలు, తెలుగులోనుంచి ఇతర భాషలలోకి అనువదింపబడిన గ్రంథాలు సమకూర్చి, ఈ మహాసభతోపాటు ప్రదర్శింప బడతవి.

కాబట్టి పండితులు, రచయితలు, ప్రకాశకులు, సాహితీసంస్థలు, పత్రికాధిపతులు మా ఈ ఉద్యమానికి సంపూర్ణంగా తోడ్పడి, జయప్రదం కావింప ప్రార్థన.

అనువాద గ్రంథాలను తమ దగ్గరనున్నవారు పంపిస్తే, ప్రదర్శనానంతరం తిరిగి పంపివేయగలము. అనువాద సాహిత్యాన్నిగూర్చి తెలిసినవారు ఆయా విషయాలనుకూడ తెలియజేయగలరని సవినయంగా అభ్యర్థిస్తూన్నాము.

పందిరి మల్లికార్జునరావు
కార్యదర్శి, సంస్కృతి సమితి
తెలుగుభాషా సమితి.

———(o)———

కవయిత్రి

# శ్రీమతి రుక్మిణమ్మగారికి సువర్ణఘంటా కంకణ బహూకరణం

## విశాఖపట్టణం



తే 31-3-52 ని విశాఖపట్టణ టవును హాలులో భాషాచరిత్ర చతురానన - ఆంధ్ర విశ్వకళాపరిషత్ సంస్కృతాంధ్ర ప్రధానాచార్యులు - విద్వాన్ శ్రీ గంటి జోగిసోమయాజిగారు ఎం. ఏ. ఎల్. టి అధ్యక్షతను - కాదంబిని - శ్రీ దేవీ భాగవతాది మహా పురాణ రచయిత్రి గృహలక్ష్మి కంకణ గ్రహీత్రి శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారికి సువర్ణ ఘంటా కంకణ బహూకరణ సభ జయప్రదంగా జరిగింది.

నగరమందలి ఉన్నతోద్యోగులతోనూ, న్యాయవాదులతోనూ, పండితులతోనూ, కవులతోనూ, వర్తకప్రముఖులతో, ఉపాధ్యాయులతోనూ సామాన్య ప్రజానీకంతోనూ, స్త్రీలతో సభ నిండిపోయింది. వేలాది ప్రజలు ఇందు పాల్గొన్నారు.

సభాగతులయిన ప్రజానీకాన్ని సన్మాన సంఘ పక్షాన్ని శ్రీమతి కోనాడ సరస్వతమ్మగారు అత్తరు, పన్నీరు, ఫలపుష్పాలతో సత్కరించి స్వాగతం ఇచ్చారు. నిర్మల జలంతో వికసించిన తామరలతో నున్నట్లు సభ ప్రకాశించింది.

శ్రీమతులు కె. గంగాబాయి, వి. లలితాంబ గారల ప్రార్థన గీతాలతో సభ ప్రారంభమైంది. శ్రీ కాళూరి వెంకట నరసింహరావుగారు బి. ఏ. బి. ఎల్. ప్రారంభోపన్యాసం చేస్తూ-

“శ్రీమతి రుక్మిణమ్మగారిని లోకానికి కెరుక పరచడం సూర్యుని కాగడాతో చూపించడం వంటిదనీ, ఆమె అనేక రకాల కృతుల మూలంగా ఆంధ్రుల హృదయాలలో నిలిచి వున్నారు. దేవీ భాగవతగ్రంథాన్ని పండిత పామర జనోపయోగంగా వ్రాసి మహోపకారం చేయడమే కాకుండా భాషలో పెద్దమార్పు తెచ్చిపెట్టారు. అలాగే ఈనాటి సభ నూతన పంథాలో నడవడం ముదావహమూ, శ్లాఘనీయమూ అయిన విషయ”మనీ ఉపన్యసించారు. ఆ పిమ్మట పురిపండా అప్పలస్వామిగారు (కవితా సమితి అధ్యక్షులు) మాట్లాడుతూ-

“శ్రీమతి రుక్మిణమ్మగారి సాహితీ ఉపాసనకు కారకులయిన శ్రీ స్థానాపతిగారు ప్రశంసా పాత్రులు. ఆయన ఆమెకు భర్త; విశేషించి గురువు. ఆమె కవిత్వం త్రికాలా బాధ్యమూ, మృదుమధుర సరళమూ, అభ్యుదయ మార్గమూ గలది. ఆమెకథలు గాని, కావ్యములుగాని - ఏమైననూసరే ఒకవిశిష్టమైనవి. అద్భుత మేధాశక్తి, ప్రతిభగల ఆమెకు ఈసన్మానము సర్వథా ప్రశంసా పాత్రము. గృహలక్ష్మి కంకణ గ్రహీత్రి అయిన ఆమె పాండిత్య ప్రతిభా విశేషాలు మనం చెప్పుకోవలసిన నవసరం లేదు, ఆమె సమితి కార్యదర్శినిగా నిర్వహించిన ఘన కార్యాలపరిమితం. నిజంగా ఈసమయంలో వారిని గురించి విశేషంగా చెప్పటం మమ్ములను మేమే స్తోత్రం చేసుకున్నట్టవుతుంది. ఈసందర్భంలో విశాఖపట్టణ పుర స్త్రీలు ఎంతకైనా ప్రశంసా పాత్రలు. గృహ నిర్వహణంతోపాటు సాహితీ పరిశ్రమలో కూడా కృతార్థత చెందారు” అన్నారు.

అధ్యక్షోపన్యాసములో శ్రీ జి.జె. సోమయాజిగారు-

“శ్రీమతి రుక్మిణమ్మగారు నాకు పుత్రీసమానులు. ఆమె అద్యతనాంధ్ర కవయిత్రులలో గొప్పది. చక్కని కవితల్లడమే కాకుండా - చక్కని నడతలోకూడా ఆమె మార్గదర్శిని; ఆదర్శమైనదీని. ఈలాంటి కవయిత్రిని పూర్వంగాని, ఇప్పుడుగాని మనం చూడలేదు. ప్రతిభావ్యుత్పత్తులు ఈమె కుగ్రపాలతో లభ్యమైనవి, ఇలాంటి

సన్మానాల కీమె సర్వదా అర్హురాలు..." అంటూ సింహతలాట సువర్ణ ఘంటా కంకణాన్ని ఆమెకు బహూకరించారు. సన్మాన సంఘ కార్యదర్శిని శ్రీమతి చీమలపాటి సూర్యమహాలక్ష్మి, అధ్యక్షురాలు శ్రీమతి దూర్వాసుల సుబ్బలక్ష్మిగారూ కవయిత్రి చేతికి కంకణాన్ని తొడిగి పుష్పమాలం కృతినిగా చేశారు. శ్రీమతి కోనాడ సరస్వతమ్మగారు చీని చీనాంబరాలూ శ్రీమతి కె. గంగాబాయిగారు వెండి దీపపు స్తంభాలూ-మరొకరు బంగారు ఉంగరమున్నగునవి కవత్రికి కానుకగా ఇచ్చారు, తదుపరి-

శ్రీమతి రుక్మిణమ్మగారు సమాధానము పద్యాలలో ఇచ్చారు.

శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ, కే. వీరభద్రరావు మున్నగువారు కవయిత్రిని గురించి కవితను గురించీ దీర్ఘోపన్యాసాలిచ్చారు.

కార్యదర్శిని తన నివేదికలో కవులను ఈనాడు ఆదరింప వలసిన విషయాలనూ, అందుకు తాము చేసి చేస్తూవున్న కృషినీ వివరించారు.

శ్రీ పింగళి, కాటూరి, రాయప్రోలు, రాళ్లపల్లి, మల్లంపల్లి, దుర్భాక, పుట్టపర్తి, తల్లావర్ఝుల, దేవులపల్లి, నోరి, కనుపర్తి వరలక్ష్మమ్మ, బత్తుల కామాక్షమ్మ, శ్రీశ్రీ, ఆరుద్ర, మొసలికంటి తిరుమలరావు, దివాకర్ల మున్నగువారు పంపిన ప్రశంసా పద్యగద్యములను శ్రీమతి లలితాంబ మున్నగువారు చదివారు. శ్రీ దూర్వాసుల సుబ్బలక్ష్మమ్మగారు కవయిత్రిని ఘనంగా సన్మానింపలేకపోయామంటూ ఉపన్యసించారు. కవులెందరో ప్రశంసా పద్యాలు చదివారు. ప్రశంసా పద్యాలన్నిటినీ శ్రీ చీమలపాటి గణేశ్వరరావు పంతులుగారు అచ్చువేయించి పంచిపెట్టారు. పురపాలక సంఘంవారు నాటిసభా వృత్తాంతాలన్నీ నగరమంతా వినిపించేటట్టు బ్రాడ్‌కాస్టు చేయించి, వనితాలోకం మీదా, వారి భాషాకృషిమీదా వారికిగల అభిమానాన్ని వెల్లడించి ప్రజల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొన్నారు-

కార్యదర్శిని వందనములతో సభ సమాప్తమయింది.

ఎస్. కమలాదేవి.

---




## ఉగాది సంచికలు

'మాతృదేవ' ఉగాది సంచిక మా కార్యాలయమునకు చేరినది. సరస్వతి త్రివర్ణముఖచిత్రముతోను, లోపలి శ్రీ దేవీ ప్రసాద్ రాయ్‌చౌదరిగారి వర్ణచిత్రముతోటి ఆకర్షణవంతముగానున్నది.

ఇందలి వ్యాసములు, కథలు, పద్యాలు, గేయాలు రసవంతముగాను, విజ్ఞానవికాసముల పెంపొందించునట్టివిగానున్నవి. కవులు, కావ్యాలు అనుశీర్షికలో కవులకు, పండితులకు యిచ్చిన ప్రోత్సాహము గమనించతగినది.

ఈ సంచికను యింత చక్కగా వెలువడ చేసినందులకు సంపాదకుడు శ్రీ ధర్ ప్రశంసనీయుడు. వెల రు 1.8.0. నల్లయువారు 25 ఏ, తంబుచెట్టివీధి మద్రాసుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

'రూపవాణి' ఉగాది సంచిక మా కార్యాలయమునకు చేరినది. సంపాదకుడు శ్రీ పి. సీతారామయ్యగారు యీ సంచికను వెలువడ చేయడంలో చూపిన సహజ సమర్థత కొనియాడతగినది.

ఇందులో అభ్యుదయ సినిమాతారల చిత్రాలు, జీవిత విశేషములు, సినిమా పరిశ్రమకు సంబంధించిన అమూల్యమైన వ్యాసములు, కథలు ఉన్నవి. ఈ సంచిక త్రివర్ణ చిత్రాలతోటి మనోజ్ఞంగా తయారయింది. వెల 0-12-0 కార్యాలయపు చిరునామా 16 సుంకురామాచెట్టివీధి, మద్రాసు 1.

**శ్రీ జాతీయ పూలమాల గేయములు : శ్రీ రాపాక అప్పారావు 'కవికుమార్' మహోదయప్రెస్, శ్రీ కాకుళం, వెల 0-4-0.**

ఇది చిన్న చిన్న గేయముల సంపుటి. ఇందలి గేయములు జాతీయత, భక్తి మొదలగు వానిని ప్రబోధించునట్టివిగాను, ఉల్లాసమును కలిగించునట్టివిగా నున్నవి.

♦ ♦ ♦

**శ్రీ నరసింహాశతకము : శ్రీ దండా నరసింహకవి, చిన్నబజార్, బరంపురము (గంజాంజిల్లా) వెల 0-6-0.**

ఇందలివి కందపద్యములు. మనతెలుగునందలి శతక వాఙ్మయ సంపదకు యిదియొక చేరిక. భక్తులకు, బాలబాలికలకు యీ చిన్న పుస్తకము పఠనీయమైనది.

♦ ♦ ♦

**రామనామము : ఆంధ్రానువాదకుడు శ్రీ చారాల నరసింహమూర్తిగారు, ప్రకాశకులు శ్రీ సీతారామ నామసంకీర్తన సంఘము, శ్రీ రామనామ క్షేత్రము, గుంటూరు, వెల 1-0-0.**

ఇది గాంధీజీ ఆంగ్లమున రచించిన గ్రంథమునకు ఆంధ్రానువాదము. ఇందు రామనామంముతో సమన్వయపరచి అనేక విషయములు వివరించబడినవి. ఈ గ్రంథ పఠనమువలన అపారమైన విజ్ఞానము, పుణ్యపురుషార్థములు సమకూరుననుటకు సందేహము లేదు.

# సంపాదకీయములు

## మద్రాసు మంత్రివర్గ నిర్మాణము.

ఎవరు ఏర్పాటుచేసినా సుస్థిరమైనట్టియు, ప్రజానురంజకమైనట్టియు, సమర్ధమయిన మంత్రివర్గ నిర్మాణముకొరకు రాష్ట్రప్రజలు ఎదురుచూచారు. కాని మంత్రివర్గ నిర్మాణమయిన తరువాత ప్రజలలో నిస్పృహ, నిరుత్సాహములు మొలకెత్తినవి.

శ్రీ సి. రాజగోపాలాచారిగారు తన అపారమైన చాతుర్యాన్ని, అనుభవాన్ని, పురస్కరించుకొని సమర్ధమైన మంత్రివర్గమును నిర్మించి మనరాష్ట్రమును విషమఘట్టములనుండి తప్పించగల సమర్ధుడని వారిని నాయకునిగా ఎన్నుకొన్నారు, కాని మంత్రివర్గ నిర్మాణము జరిగినపిదప ఆయన తన బాధ్యతను వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా నిర్వహించలేదనిపిస్తున్నది.

నియమితమంత్రులు చాలామంది పరిపాలనానుభవము, దక్షతగలవారని కాని, ప్రస్తుతవిషమ సమస్యలను పరిష్కరించ గలవారనికాని, ప్రజలఅభిమాన పాత్రులైన నాయకులనిగాని చెప్పలేము.

మంత్రివర్గ నిర్మాణములో ప్రముఖపాత్రవహించిన శ్రీమతి సౌందరం రామచంద్రన్, కుట్టిమాళు అమ్మాళ్ వంటి నారీమణులున్నను రాజాజీ మంత్రివర్గములో స్త్రీలకు స్థానం లభించకపోవడం విచారకరము.

ఏదోవిధంగా మంత్రివర్గ నిర్మాణమయింది. కాని ఒకరకంగా ముసుపటి అవకతవకలు, అరాజకము, బంధుజనప్రేమకు ప్రభుత్వ వ్యవహారములలో అవకాశములేక పోవచ్చును. పరిష్కారానికి ఎదురుచూస్తున్న వివిధసమస్యలు వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా పరిష్కారము కాగలవని ఆశిద్దాము.

## స్టేట్ కవున్సిలుకు సభ్యుల నియామకం

కళాక్షేత్ర నిర్వాహకురాలు రుక్మిణీదేవిని, సుప్రసిద్ధ సినిమానటుడు పృధ్వీరాజును స్టేటుకౌన్సిలుకు సభ్యులుగా నియమించడం హర్షింప తగినవిషయం.

ప్రజాదైనిక జీవితములో లలితకళలు, సినిమాకళ వహిస్తున్న ప్రాముఖ్యతను ప్రభుత్వము గుర్తించి వానికి ప్రాతినిధ్యములు యివ్వడము శుభసూచకము.

ఈప్రతినిధులు కళాభ్యున్నతికి, ప్రజల జీవితముతో యీకళలను అన్వయ పరచడానికి యితోధికంగా కృషిచేయగలరని ఆశిస్తున్నాము.

## శ్రీ స్థానాపతి రుక్మిణమ్మగారికి మరొక కంకణం

ఈఏటి గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారికి మరొక స్వర్ణకంకణ బహూకరణ సన్మానము జరిగింది. విశాఖపౌరులు ఆమె కవితానైపుణ్యాన్ని, భాషాసేవను గుర్తించి సన్మానించినందుకు అభినందనీయులు. ఇంకా ముందు ముందు అనేక ఉత్తమ రచనలను రచించి తెలుగు భాషాసంపదను అభివృద్ధిచేసి యిట్టిసన్మాన పరంపరల నందుకొని పండిత పామరుల ఆదరాభిమానములకు శ్రీమతి రుక్మిణమ్మగారు పాత్రురాలగుదురని మేమాశించుచున్నాము.

---

